*Issued on 18—9—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

*FRIDAY, 30th SEPTEMBER, 1955.*

**VOLUME X — No. 1.**

## CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1956

PRICE 6 annas

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Friday*, 30*th September*, 1955.

---

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## QUESTIONS AND ANSWERS.

### Short Notice Starred Questions.

*Discussions about the Second Five Year Plan.*

468-A.

*2078-A. Q.—SRI P. SUNDARAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to place on the Table of the House a statement regarding the discussions about the Second Five Year Plan of this State with the Planning Commission at Delhi recently ?

THE HON. SRI K. VENKATA RAO :—

A statement on the discussions with the Planning Commission regarding the Five Year Plan of the Andhra State is placed on the table of the House.

SRI P. SUNDARAYYA :—ఇందులో ఈ heavy industries కి సంబంధించి ఏమీలేదు. వాటినిగురించి ఏమి జరిగింది ? మనకు heavy industries లో ఏదైనా ఒకటి ఇచ్చేందుకు కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తానని ఏమైనా చెప్పిందా ?

THE HON. Sri K. VENKATA RAO :—Heavy industriesను గురించి ఇంకా Planning Commission కూ గవర్నమెంటు of Indiaకు మధ్య చర్చలింకా పూర్తికాలేదు. అది నిర్ణయమై target వచ్చిన తరువాత మన రాష్ట్రింలో Government of India వారు ఎంత పెడతారో అది తరువాత నిర్ణయం చేస్తారు. అవి దీనికి extra కాని దీనిలో include అయ్యేదిలేదు.

Vide appendix on page 131 infra.

[30th September 1955

SRI P. SUNDARAYYA :—Steel fabricating కాని లేక Heavy Electrical Industry కాని మూడు కోరాలని గత శాసన సభలో అందరం అనుకున్నాం. అందులో ఏది వచ్చుటకు అవకాశం ఉందండి ?

THE HON. SRI K. VENKATA RAO :—మేము మూడుకూడా అడిగాం. అక్కడున్న ఒక పెద్ద మంత్రిగారి అభిప్రాయ ప్రకారం Heavy Electricals కనుక విశాఖపట్టణంలో పెట్టినట్లయితే ships construction లో cost తగ్గి దేశం మొత్తానికి లాభిస్తుందని. ఇంకొకరి అభిప్రాయం మనం ఎక్కువ ఎరువు consume చేస్తున్నాం కనుక ఎరువుల factory మనకిస్తే బాగుంటుందని. ఇంకా ఏ Ministry తో discussion complete కాకపోవడంవల్ల అది తేలలేదు కాని మేము వెళ్ళిన వాళ్ళమంతా కూడా తలాఒక మంత్రిగారినీ పట్టుకుని, అందరం కలిసికూడా పట్టుకుని, మన కేసు మాత్రం గట్టిగానే అక్కడ present చేసి వచ్చాం. ఇంకా ముందుకూడా చేయవలసిన కృషి ఉంది.

SRI R. B. RAMAKRISHNA RAJU :—మొదట మనం పంపించిన ఈ planning scheme లో 11 కోట్ల రూపాయిలు block grant for village developement అని వేసి యున్నది. అది ఏమయింది ? అది ఎందులోనైనా చేరి ఉన్నదా ? అది ప్రత్యేకంగా అట్లానే ఉందా మంత్రిగారు సెలవిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—మనం Village plans విడిగా తయారు చేసుకున్నాం. విడిగా వారికి పంపించాం. కాని ఇండియాలో ఏ ఇతర రాష్ట్రంలోకూడా village plans విడిగా తయారు చేయకపోవడంవల్ల ఆ heading వీరు పెట్టకుండా, మనదాన్ని రెండు రకాలుగా పెట్టారు. ఇక్కడ National Extension service and Community blocks లో ఇక్కడ వేసిన 11 కోట్లూ కాకుండా ఇంకా additional improvement tempo create చేసి community block లు పెట్టడంకోసం ఇంకో 5 కోట్ల పై చిలుకు అక్కడ వస్తోంది. మిగిలిన items లో 2 కోట్ల రూపాయిలు village plans అని పేరుతోటే వారే allocate చేసి ఆ heads లో పెట్టేశారు. అందుచేత గ్రామాలకు మొత్తంమీద సంబంధించింది final గా 11 + 5 పదహారు పై చిలుకున్నూ, ఇవో రెండు, దరిదాపు 19 కోట్ల రూపాయిలు ఆ items లో చేరి ఉన్నాయి. ఉదాహరణకు ఆపైనున్న 75 లక్షల రూపాయిలు ఇక్కడ transport కు సంబంధించినవే. Education లో 25 లక్షల రూపాయిలున్నాయి. Medical and Public Health లో ఇంకో 25 లక్షల రూపాయిలున్నాయి.

ఇల్లాగే వీటిలో కంబైండై రెండు కోట్ల రూపాయిలున్నాయి. ఇది వారు వ్రాసిన రిపోర్టులోనే వ్రాశారు. ఆంధ్ర రాష్ట్రంలో ప్రత్యేకంగా తయారుచేసిన village plans యొక్క వినియోగార్థం వీటిని వినియోగించుకోవలసినదనిన్నీ తరువాత చర్చలలో ఇంకో వాగ్దానంకూడా ఇచ్చారు. మీరు ఇది ఖర్చుపెట్టుకున్న కొద్దీ మళ్ళీ ఎలక్షన్ మీకు ఇస్తామన్నారు.

SRI R. B. RAMAKRISHNA RAJU :—మన State లో ఈ plan finalise చేసేటప్పుడు దాన్ని ప్రత్యేకంగా ఇప్పుడు మంత్రిగారు చెప్పినట్లు ప్రత్యేక head లో దాన్ని చూపిస్తే బాగుంటుందేమో ? ఆ ప్రకారం ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు 125 కోట్ల basis మీద department లన్నికూడా మళ్ళీ plan లు తయారుచేస్తున్నాయి. ఈవేళ ఆఖరురోజనుకుంటాను. అవి రావటానికి మన departmental heads కు Secretaries కు ఇచ్చిన instructions లో ఇది విడిగా అట్టే పెట్టవలసినదనిన్నీ దీనికి sources అన్నీ తరువాత మేము mention చేసుకుంటాం అనికూడా వాళ్ళకు instructions ఇచ్చాం.

SRI P. SUNDARAYYA:—రైలుమార్గాలు వేటికోసం మీరు అక్కడ చర్చించారు. సూచించినవాటిలో ఏవి రావటానికి అవకాశం వుంది ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇదీ అదే స్థితిలో వుంది. వారితో చర్చించాం. ఇదివరకు మనం planలో పెట్టుకున్నటువంటి క్రిందటి మాటు చెప్పిన మూడు విషయాలను గురించికాకుండా తరువాత వారు raise చేసిన issues కూడా Chief Minister గారు వారితో చర్చచేశారు. తరువాత వారివే కొన్ని proposals ఉన్నాయి. గుంటూరునుంచి బందరువరకూ double line వేయడానికి ఇల్లా అడ్డత్రోవను భీమవరందాకా వెయ్యడానికి, ఇవన్నీ proposals ఉన్నాయి. వారు final గా చెప్పిందేమిటంటే వచ్చే ఎలోకేషన్ 800 కోట్లా. 900 లా 700 లా అనే విషయం తేల్చినతరువాత మళ్ళీ చర్చచేసి తుది నిర్ణయం చేస్తామని వారు మాకు జవాబు చెప్పారు.

SRI P. SUNDARAYYA :—వారు సూచించిన ఈ చిన్నచిన్న రైళ్లు కాకుండా మనం సూచించిన పెద్దరైలుమార్గాలలో మదనపల్లినుంచి ఇటు బళ్ళారి మీదుగాను తరువాత మాచర్లవరకూ ఒక line సూచించి ఉన్నాం. నంద్యాలనుంచి

నెల్లూరువరకు line సూచించాం. విశాఖపట్నంనుంచి కొత్తగూడెం సూచించాం. ఈ మూడు ప్రధాన రైలుమార్గాలలో దేనికైనా ఒకదానికి ఆస్కారం ఉన్నట్లు తెలియజేశారా ?

THE HON. SRI K. VENKATA RAO :—Discussion లో వచ్చిన మాటలను బట్టిచూస్తే విశాఖపట్నంనుంచి కొత్తగూడెం రైలుమార్గానికి terrain బాగాలేదని, చెప్పారుగాని మిగిలిన విషయాలు అనుకూలంగానే వస్తాయని అనుకుంటున్నాం.

SRI C. SUBBARAYUDU :—పత్రికలలో తుంగభద్రా High level canal కు 5.2 crores allot చేసినట్లుగా విన్నాం. ఈ 5.2 కోట్లు మనకేనా లేక పోతే Mysore కు సంబంధించిన portion కు కూడా అన్వయిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—దానికి అన్వయించదు. అంతా మనకే.

SRI PILLALAMARRI VENKATESWARLU :-దీంట్లో financial resources of the state, performance in the First five year plan. ఈ రెండూకూడా consideration లోకి తీసుకొని State targets నిర్ణయించినట్లు ఉదహరించబడ్డది. Financial resources of the State అన్నప్పుడు ప్రత్యేకం industrial గా develop కానటువంటి ఆంధ్రదేశంవంటి ప్రాంతాలలో ఇవి తక్కువగా ఉంటాయి కనుకనూ, performance in the First Five Year Plan అన్నప్పుడు, ఆంధ్రరాష్ట్రం క్రొత్తగా ఏర్పడి వెంటనే ఆ First Five Year Plan targets fulfil చేసుకో లేకపోయినాం కనుకనూ, ఈ రెండూ consideration లోకి తీసుకోవడంవల్ల మనకు disadvantage వచ్చి ఉంటుంది. కనుక, మనకు సంబంధించినంతవరకయినా ఈ రెండూ consideration లోకి తీసుకోకుండా ఉండేటట్లు మన మంత్రివర్యులు వాదించారా ?

THE HON. SRI K. VENKATA RAO :—వాదన ఆరురోజులు ఆరేసి గంటలు జరిగింది. జరిగినవన్నీ ఇక్కడ చెప్పడానికి తగినటువంటి వ్యవధిలేదు. వాళ్లు కొన్ని fundamentals పెట్టారు. దీనివల్ల మన plan మాత్రం అట్టే suffer కాలేదని నాఅభిప్రాయం. ప్రధానమైన కారణమేమంటే మన resources ని బట్టి లెక్కపెట్టుకుంటే మనకు 96 కోట్లకంటె ఇవ్వవలసిన అవసరంలేదు. Area ని బట్టి చూచుకున్నట్లయితే నూటపదో నూటపదకొండుకోట్లో ఇవ్వవలసియుంటుంది. Population ఒకటే కనుక చూచుకున్నట్లయితే 128.1 ఇవ్వవలసియుంటుంది. ఇన్ని factors మనస్సులో పెట్టుకునే వారు average 110 కి తీశారు. తరువాత

discussion నాడు 118 కి వెళ్ళింది. Groups ఐనతరువాత, మేము మళ్ళీ మాట్లాడిన తరువాత 125 దాకా వెళ్ళారు. తరువాత ఇంకా కొన్ని items, statement లో నేను నిరూపించిన 4, 5 item ల లోనూ anticipation ప్రకారం జరిగిన చర్చల ప్రకారం సుమారు 19 కోట్ల రూపాయలు ఇంకా మనకు రావలసినవి ఉన్నాయి. తరువాత తయారయ్యేటటువంటి draft లో ఇంకొక 19 కోట్లుకూడా చేరుతుంది.

**MR. SPEAKER : Do you not think it too big a question for more questions to be put. We are having discussion. There are many questions to be answered. It has yet to be finalised. 'It is at two stages, there as well as here.**

THE HON. SRI K. VENKATA RAO :—మన మిత్రులతో మాట్లాడడంలో ఏం జరిగిందో కొంతైనా చెప్పమంటే, short notice question ఇస్తే ఒక statment ఇస్తానని మనవిచేశాను ఈవేళ మీరు నన్ను ఎంత cross-examine చేసినా నేను గాలిలోవున్న జవాబులు చెప్పవలసి వస్తుంది. ఎందుకంటే department ల దగ్గరనుంచి కాగితాలు నాకింకా అందలేదు.

**MR. SPEAKER : It is yet to be finalised. There are two stages there as well as here.**

THE HON. SRI K. VENKATA RAO :—నేను మనవిచేసేది ఇంకా రెండు stage లు Delhi లో ఉన్నాయి. December నెలలో Draft plan publish చేస్తారు. మార్చినెలలో అది finalise చేస్తారు. అక్కడవాళ్ళ resources కూడా final గా తేలలేదు ; అనేకమైన adjustments జరగాలి. మన various items ఇంకా కొంచం stage లోకి వచ్చినతరువాత మళ్ళీ ఈ మాటు మనం సమావేశమయ్యేనాటికి, మిగిలిన వివరాలన్నిటితోటి పూర్తియైన statement సభవారికి అందజేసి కావాలంటే Chief Minister గారు ఒప్పుకుంటే చర్చకూడా పెట్టుకునేందుకు నా కభ్యంతరం ఏమీ లేదు. ఈరోజు అంకెలతో కూడిన పరిపూర్ణమైన picture ఇచ్చేస్థితి ఈ నిమిషంలో లేదని మనవి చేస్తున్నాను. తరవాత సభవారి నిర్ణయం speaker గారి నిర్ణయం. Chief Minister గారి నిర్ణయం. మీరు ఎల్లాచేస్తే నేను అల్లాచేస్తాను.

SRI P. SUNDARAYYA :—బెంగాలు పారిశ్రామికంగా చాలా అభివృద్ధి చెందింది. ఇప్పుడు క్రొత్తగా పెట్టే steel factory కి కావలసిన 100 కోట్లు తీసినా B.C. రాయిగారి ప్రకటన ప్రకారం 250 కోట్ల రూపాయలు [illegible]

350 కోట్లు sanction ఐనదని ఇంకా పెరిగితే 400 దాకా పెరగవచ్చని అందుచేత వాళ్ళ జనాభా 2 కోట్ల 50 లక్షలైతే మన జనాభా 2 కోట్ల 20 లక్షలు కనుక దాన్నిబట్టి మనకుకూడా 250 కోట్లు ఇవ్వాలని కేంద్రప్రభుత్వ దృష్టికి తీసుకువస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—Minister లు ఢిల్లీ వెళ్లి వచ్చిన తరువాత అంకెలకు కొంచం తేకలువస్తూ ఉంటాయి. అందుచేత Madras ది 225 కోట్లని పత్రికలవారు ప్రచురించవద్దని కోరిక. మనకు ఇచ్చేది 200 కోట్లని పత్రికలలో చదివాం. అసలు communication 180 కోట్లే.

SRI P. SUNDARAYYA :—19 కోట్లుకూడ ఆ లెక్కలోకి రాదు గదా ?

THE HON. SRI K. VENKATA RAO :—మీరు ఏ communication లో చూచి ఉంటారు ? 12 కోట్ల 79 లక్షల రూపాయలు సిఫారసు అయి వున్నది. రేపు 4 వ తేది సంజీవరెడ్డిగారు ఢిల్లీకి వెళ్లుతున్నారు. National Development Council మీటింగులో 40% of the present amount of allocation, Community Project క్రింద extra గా ఇమ్మని నిర్ణయించారు. దానిక్రింద ఇంకా ఒక అయిదుకోట్లు వస్తుంది. అందువల్ల 6, 7 కోట్లకు సరిపోయిన వ్యవహారం ఉండ నేవుంది. ఇంకా overflow schemes ను గురించి, Urban water supply, minor ports, వాటి క్రిందికి తీసుకొచ్చారు. శాస్త్రరీత్యా చెప్పడంగాని propaganda కోసం నేను చెప్పేది ఏమిలేదు. Propaganda కు కావలనంటే ఇంకొక 20 కలిపేవాణ్ణి. కాని ఆ దృష్టిలేదు. పట్టుకుంటారని తెలుసు.

MR. SPEAKER :—కొదండి. ఇప్పుడు స్థూలంగా ఆలోచించాలి. If you get into details there will be no end. The subject is big enough for five hours or even two days. I hope you have got the statement. Study చేయండి. Further details కావాలంటే questions వేయండి. Subject after subject deal చేస్తాం.

## Starred Questions.

MR. SPEAKER : Questions Nos. 469 and 470 will be taken up together.

*District Museum at Nellore.*

469—

*376 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether there are proposals with the Government to start a District Museum in Nellore district in pursuance of the proposals of Sundararama Dutt ; and

(b) if so, when it will be opened ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) There are no such proposals with the Government at present. The Composite Madras State dropped the proposals of Sri Sundararama Dutt to open a District Museum at Nellore. The question whether any further action should be taken in the matter is under consideration.

(b) Does not arise.

*Museum in the Andhra State.*

470—

*1153 Q.—SRI A. KALESWARA RAO :

SRI S. VEMAYYA :—

Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government propose to start a Museum in the Andhra State ;

(b) whether the Government propose to convert the existing Museum at Vijayawada into a State Museum or ;

(c) whether the Government propose to open the State Museum at any other spacious place in Vijayawada ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) to (c)

The question of opening a Government Museum for this State is under consideration and proposals in the matter are awaited from the Board of Revenue.

Sri S. VEMAYYA :—ఈ సుందరరామదత్తు ఎప్పుడు ప్రభుత్వానికి proposals అందచేశారో తెలుసుకోవచ్చునా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆయన మద్రాసీయో, బెంగాలీయో నాకు తెలియదు. Former honorary correspondant of the Government Muscum, Madrasగ ఉంటూవచ్చాడు. ఇది 1952-53లో ఆయన ఏదో Proposals Madras Govenment కు పంపించినాడు.

SRI S. VEMAYYA :- ప్రభుత్వం యొక్క ఆలోచనలో ఉందని రెండవ ప్రశ్నకు జవాబు చెప్పారు. ఎంతకాలంలో ఒక నిర్ణయానికివచ్చి ఈ museum open చేయడానికి ప్రభుత్వం పూనుకొంటుందో చెప్పుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Museum విషయంలో తొందరపడితే జరిగేవిషయం కాదు. అది కొంచెం సమగ్రంగా ఆలోచించవలసిన విషయం. అందుకని Board of Revenue వారిని అడిగాము. వారు సమాధానం చెపుతారు.

Sri P. SREERAMULU :—District museun గుంటూరులోకూడ స్థాపించడానికి ప్రభుత్వ ఆలోచనలోఉన్నదా ? అలాంటి proposals ఉండే టట్లయితే అక్కడఉండే Town hall బిల్డింగులను తీసుకోవలెనని స్థానికఅధికారులకు అభిప్రాయంఉన్నట్లు ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. Sri B. GOPALA REDDI:—ముందు State Museum ఏదో తేలితే తరువాతజిల్లా museum సంగతి ఆలోచిస్తాం.

SRI M. NAGI REDDI :—అధ్యక్షా, నాగార్జునసాగర్ ప్రాజక్టు నిర్మాణం మూలకంగా నాగార్జునకొండదగ్గరఉన్న museum మునిగిపోతుంది. దానిని తరలించవలసిన అవసరం ఉందని ప్రభుత్వానికి తెలుసు. అందువల్ల అవి తరలించేదానితోపాటు State museum ను కూడ ప్రాముఖ్యం వహించేటటువంటి నాగార్జునసాగర్ project దగ్గరనే State museum ను, నాగార్జునకొండ museun తో సహా కలిపిపెట్టడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అది విజయవాడ లేనో ఎక్కడ పెట్టవలెనో Board of Revenue వారిని అడిగారు. ఇవిఅన్ని కూడ విజయవాడకు తరలించవలెనా, నాగార్జునకొండ దగ్గరనే Museum పెట్టవలెనా, ఇవి అన్ని కూడా ఆలోచించవలసిన విషయాలు.

30th September 1955]

SRI R. B. RAMAKRISHNA RAJU:—State Museum ఏర్పాటు చేసేటప్పుడు Madras Museum లో ఉంటే వస్తువులు మనకు ఏమైనా వస్తవా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అది Andhra Act లో తమరు చూడవచ్చును.

SRI L. LAKSHMANA DAS :—ప్రపంచ విఖ్యాతిగ జరుగబోతున్న విశాఖపట్టణంలోనే Museum పెట్టితే చాలా బాగుంటుంది. దానినిగురించి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ప్రపంచ విఖ్యాతమైన విషయాలు అక్కడ ఏమిజరుగబోతున్నాయో, నాకు తెలియదు.

SRI VIJAYA BHASKARA REDDI :—అధ్యక్షా, ఫాజల్ అలీ కమిటీ రిపోర్టు ఇంకా రెండురోజులలో ప్రచురణ అవుతుంది. అపుడు బళ్లారి హంపి మనకు వస్తవి అంటున్నారు. కనుక ఈ State Museum పెట్టేటప్పుడు హంపిలో పెట్టడానికి ఏమైనా ఆలోచిస్తారా.

MR. SPEAKER . The question to have a museum has not been settled

THE HON. SRI B. GOPALA REDDI .—ఈ విషయం Board of Revenue వారికి పంపిస్తాము.

Sri N. C. SESHADRI .—ఈ సంవత్సర ప్రారంభంలో ఢిల్లీలో జరిగినటువంటి Museum conference కు మన ప్రభుత్వ ప్రతినిధులు ఎవరైనా పోయినారా, పోకుంటే ఎందుకు పోలేదు ? తెలవిస్తారా.

THE HON. SRI B. GOPALA REDDI :—వేరే ప్రశ్నవేస్తే సమాధానం ఇస్తాము.

SRI V. VISWESWARA RAO :—మన రాష్ట్రంలోఉంటే శిల్ప సంపద ఇతర రాష్ట్రాలకు ఇతరదేశాలకు కొంపోబడినది అని తెలుస్తున్నది. దానిని తిరిగి తెప్పించేదానికి ప్రభుత్వం పూనుకొంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—పూనుకొంటాము గాని, ఫలితం ఎట్లా ఉంటుందో తెలియదు.

SRI N. C. SESHADRI :—ఆంధ్రరాష్ట్రంలో Museum స్థాపించడానికిగాను కేంద్రప్రభుత్వంనుంచి మనకు ఎంతడబ్బువచ్చింది తెలవిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Notice ఇస్తే సమాధానం చెపుతాను.

*Kavali and Kanupur Canals.*

471—

*379 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether there are proposals with the Government to take up the execution of Kavali and Kanupur canal works in this year; and

(b) if not, the reasons therefor ?

THE HON. SRI N. SANJEEVA REDDI .—

(a) to (b)

Not this year. The question of taking up the execution of Kavali and Kanupur Canals during the 2nd plan period is being examined in consultation with the Planning Commission.

SRI S. VEMAYYA :—ఈ కాలవలు రెండుకూడ అతి అవసరం అయినది అందువల్ల ఇది త్వరగా expedite చేయడానికి పూనుకొంటుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అత్యవసరం అన్న విషయం అంగీకరిస్తాం. నందికొండలో ఇది ఒకభాగమే కాబట్టి ఎంతత్వరగా వీలైతే అంత త్వరగా ముగించాలనే మా ఆశ. కాని Government of India వారు allot చేసిన మొత్తాన్నిబట్టి బోర్డువారు పనిసాగించే దాన్నిబట్టి ఉంటుంది.

Sri C. SUBBARAYUDU :—ఇప్పుడు కావలి కనుపూరు canals కు నందికొండనుంచి feed చేసేటట్లుగా నందికొండ ప్లానులో చేర్చినట్లుఉంది. అది Temporary arrangement ఆ ? లేకపోతే Khosla కమిటీరిపోర్టు చేసినట్లుగా సిద్దేశ్వరంనుంచి feed చేస్తారాండి ?

THE HON. SRI. N. SANJEEVA REDDI :—ఇపుడు వచ్చిన నందికొండనుమానివేసి ఎపుడో సిద్ధేశ్వరం వస్తుంది అని దానిక్రింద feed చేస్తామంటే వాండ్లు ఒప్పుకోరు. ఇప్పటికి నందికొండద్వారా వచ్చేనీటిని వారికి సప్లయిచేసి తరువాత comprehensive గా గోదావరి సిద్దేశ్వేశ్వరం scheme వచ్చినపుడు ఏ కాల్వలైతే convert చేయడానికి వీలు అవుతుందో అవి అన్ని మార్చుకోవచ్చు.

30th September 1955]

SRI A. C. SUBBA REDDI .—ఈకాల్వలు రెండు నందికొండ స్కీములో రెండో భాగములో ఉన్నాయి కాబట్టి మొదలుభాగములోనే చేసేదానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Dam ను కట్టి మిగిలిన కాల్వవరకువస్తే తరువాత ఈ branches తీసుకొనిపోవచ్చును. Branches మొదలు త్రవ్వివదిలిపెట్టితే dam అవసరంలేకుండా (1st phase లో) ఇది అయ్యేపనేనా ? కాదు. కాబట్టి Government of India వారు అంటే ప్లానింగు కమిషన్ వారు phasing మొదలులో dam కాలువలు పెట్టారు.

SRI A. C. SUBBA REDDI :—ఈరెండు కాల్వలకు నందికొండ నీళ్ళేగాక పెన్న నీళ్లు పారడానికి వీలు ఉందికాబట్టి, 1st phase లోనే తీసుకోవలసిందిగ నేను ప్రార్థిస్తున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—కాబట్టే మేము సోమశిలనుకూడ flood control schemeలో Government of India కు recommend చేశాము. నందికొండ రాకపోయినా, ఆలస్యం అయినా, సోమశిలను త్వరగా ఆనకట్ట dam reservoir కట్టితే దానిద్వారా ఈ కాల్వలో నీళ్లుపారించడానికి వీలు అవుతుంది.

SRI V. KOTHANDARAMI REDDI :—Nagarjunasagar project వల్ల 2nd phase లో ఈ కనుపూరు కాల్వలకుకూడ కాలవలు త్రవ్వవలసియున్నదికాబట్టి dam కట్టినతరువాత నీళ్లు ఉపయోగించుకోడానికి కాల్వత్రవ్వడం అవసరం కాబట్టి దానినిగురించి ఆలోచిస్తు మంత్రిగారు శెలవు ఇచ్చినట్లు Somasila project లోకూడ ఇది వున్నది కాబట్టి ఇది దృష్టిలోపెట్టుకొని Government of India వారికి ఈ సలహా చేస్తారా అని అడుగుతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ కావలి,కనుపూరు, కాల్వకువచ్చిన ఇబ్బంది ఏమంటే అటువంనంది కొండక్రిందానీళ్లు తెచ్చుకోవచ్చును, ఇటు సోమశిల, సిద్ధేశ్వరంవచ్చినా నీళ్లు తెచ్చుకోవచ్చును. కాబట్టి మూడింటిలో ఏదివచ్చినా, ఎప్పటికో అవకాశం ఉంది అనే ఆశతో వుండేదానికి వీలు అవుతుంది. కాని మూడింటిక్రిందకూడ ఆలస్యం అవుతుంది. తప్పదుమరి.

Sri P. SUNDARAYYA :—సోమశిల రాకపోయినా, సిద్ధేశ్వరం కట్టకపోయినా, నందికొండ వచ్చేది ఆలస్యమయినా, ఈరోజు పెన్నలోవున్న నీటిని సంగము ఆనకట్ట దగ్గరనుంచి కాలువలు త్రవ్విస్తే చెరువులు నింపేదానికయినా పనికి

వస్తుందని ఇంజినీర్లంతా చెప్పినసంగతి మీకు తెలిసేవుంటుంది. అటువంటి సందర్భములో వాటికి ముడిపెట్టకుండా ఈ కాలవను త్రవ్వడానికి ఏమి అభ్యంతరమున్నది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇది comprehensive scheme గనుక ఈఖర్చు అందులోనే చేరివున్నది. కాబట్టి ఇప్పుడు ప్రత్యేకంగా దానికోసం కొన్నికోట్లు ఖర్చుపెట్టడమంటే, నందికొండకు allot చేసినదాంట్లో కొంత తగ్గించుకొని ఈ కాలవలు త్రవ్వించుకోవలసి యుంటుంది. ఇప్పుడు ఆ విధంగా చేయడమనేది ఎంతవరకు feasible గా వుంటుందో చెప్పడం కష్టము.

SRI C. SUBBARAYUDU :—నందికొండగుండా కావలి-కనుపూరు canal కు నీరు సప్లయిచేయడానికి ఇంకా ఆలస్యం పడుతుంది. ఇప్పుడు High level canals excavate చేస్తున్నారు. గనుక main canal కు maximum capacity పెట్టినట్లయితే నందికొండనుంచి canal కు సప్లయిచేసేంతవరకు ఆ కావలి-కనుపూరు canal లో నుంచి నీరు ఉపయోగించుకోడానికి వీలుంటుంది. అందువల్ల కావలి-కనుపూరు canals take up చేయడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—తుంగభద్ర high level canal అనేదే కాలేదు. ఇది త్రవ్వినతరువాత పెన్నలోకి నీరువదలితే ఈ నీళ్లు అక్కడ నెల్లూరుకుపోతే, ఆ సంఘము అనకట్టదగ్గర దాన్ని pick up చేస్తే అప్పుడు కావలి-కనుపూరు కాలవలు కావలసియుంటుంది. ఇంతలోపల నందికొండే అయిపోతుందేమో.

SRI V. KODANDARAMA REDDI :—ఈ కావలి-కనుపూరు కాలవ క్రింద ఉండే ఆయకట్టుదారులు ఎకరా ఒకటింటికి వంద రూపాయలు చొప్పున bettermenttax ఇవ్వడానికి సిద్ధపడుతున్నారు అనేది ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ప్రభుత్వము దృష్టికి తీసుకురాకపోయినా, betterment levy bill అని ఒకటిపెట్టుకొంటున్నాము. ప్రతివారు వంద, రెండువందలు estimate బట్టి ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు, ఇచ్చితీరాలి. చట్టమొకటి చేసినపుడు తప్పకుండా ఇవ్వవలసి ఉంటుంది. ఇస్తామని చెప్పడంకాదు. ఇస్తామని చెప్పేదానిమీద ఆధారపడడానికి వీలులేదు అని అనుభవంబట్టి తెలిసింది. మాకు ఈ ప్రాజెక్టు కట్టిస్తే ఇంత ఇస్తాము, అంత ఇస్తాము అని చెప్పడమేకాని పనిప్రారంభించేటప్పటికి చాలామటుకు వెనుకకు అవుతున్నారు. కాబట్టి ఈ betterment levy అనేది legislation ద్వారా పెడుతున్నాము. కనుక వారు ఇస్తామనిచెప్పినా, చెప్పకపోయినా, వసూలుచేయడం జరుగుతుంది.

30th September 1955]

SRI M. NAGI REDDI :—నాగార్జునసాగర్ క్రింద కలుపవలెనా, first phase లోనా, second phase లోనా, అనే సమస్యలు వస్తున్నాయి. నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు ద్వితీయపంచవర్ష ప్రణాళిక 20 కోట్లు చిల్లరకేటాయించారు. అసలు ఈ first phase లో అంటే ద్వితీయపంచవర్ష ప్రణాళిక కాలములో నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తి అవుతుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—నాగార్జునసాగర్ కు first phase లో 70 కోట్లురూపాయలైతే, ఈ సంవత్సరం మనకు 21 కోట్లు రుపాయలుఉన్నాయి. అందులో హైదరాబాదు భాగముకూడ ఉన్నది. 10, 12 కోట్లువారికికూడ ఇచ్చారు. దీనికిగాను second five year plan కు సంబంధించిన మొత్తము 70 కోట్లు. Total expenditure ఏమో 120 కోట్లు. కాబట్టి ఎంతవరకు ఈ 30 కోట్లరూపాయలలో ఖర్చుపెట్టగలమో అంతవరకు పనిజరుగుతుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇప్పుడు ఇంత వరకు ఈ first five year plan లో నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు ఎంతడబ్బు కేటాయింపుచేశారు ? ఈ first phase amount లో Next year కు ఎంత కేటాయింపుచేశారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—First five year paln లో ఇది last year అన్నమాట. దీనికిగాను ఏదో ఖర్చుపెడుతున్నాము. మేమేమో వారు ఇంతడబ్బు కేటాయించడానికి ఇంతవరకు చెప్పలేదు. పార్లమెంటులో ఏమో ౭౪ కోటిరూపాయలు ఇచ్చినట్లు ఒకప్రశ్నకు సమాధానంచెప్పినట్లు తెలిసింది. కాని మనకు ఇంతవరకు వ్రాతపూర్వకంగా ఏమిరాలేదు. రాలేదు అనుకోకుండా, నిన్ననే నందికొండ బోర్డుమీటింగు హైదరాబాదులో జరిగింది. మేము కావలసినడబ్బు ఖర్చుపెట్టడానికి కావలసిన ఏర్పాట్లన్నిచేశాము. Administrator, Chief engineer వాళ్లకు వెంటనే, ఒకటి, రెండు నెలలవరకు 20, 30 లక్షలు ఖర్చుపెట్టడానికి ఏర్పాటుచేశాము. మాకు ఇదివరకు ఏమిరాలేదనుకోకుండా, ఖర్చులుమాత్రం పెట్టడానికి ఏర్పాటుచేస్తున్నాము.

SRI. C. SUBBARAYUDU :—ఇప్పుడు high level cana పెన్నలోకి అయిదు సంవత్సరములలో complete చేసినా, ఈ నందికొండ main canal కు allotment చేసినటువంటి మొత్తములోనుంచి కావలి-కనుపూరు కాలువలు ఈ first stage లోనే complete చేసినట్లయితే ఈ water, ఆయకట్టు develop అయ్యేవరకు ఉపయోగపెట్టుకోవచ్చు. అంతలోపల నందికొండ canal కూడ చేయవచ్చు. ఆవిధంగా ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు High Level canal పూర్తికావడానికి ఎంతో మొత్తంకావాలి. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రప్రభుత్వానికి 5.2 crores మాత్రమే allot చేస్తున్నారు. ఈ తుంగభద్ర ఎగువ కాల్వకు మైసూరుప్రభుత్వానికి 1.8 crores చేయవచ్చు. All told 7 crores of rupees చేస్తే చేయవచ్చు. ఈ తుంగభద్ర High Level Canal కు ఈ Second Five Year Plan కాలములో, అంటే ఈ ఆరు సంవత్సరాలలోపల ఈ 7 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాలి. మనమందరముకలసి అప్పుడు పెన్నలో నీరు drop చేయడానికి వీలవుతుంది. ఆ కాలువలో నీరు, ఇక్కడ కావలి-కనుపూరు కాలవలు తయారుగా ఉంటు నేతప్ప వాడుకోడానికి వీలు ఉండదు అని సుబ్బరాయుడుగారి ఉద్దేశమై ఉంటుంది. ఆ రకంగా Planning Commission వారిని కావలి-కనుపూరు కాలవలు తీసుకోవలసిందని చెప్పితే మాకేమి ఆక్షేపణలేదు. కావలి-కనుపూరు కాలవలు మొదట తీసుకొంటే నందికొండ main work suffer అవుతోంది. ఈ కాలవలకు ఖర్చుపెట్టేమొత్తము ఈ allotment లో నుంచే ఖర్చుపెట్టవలసియుంటుంది. కాబట్టి నందికొండ proper dam reservior వగైరాలు అంతా కొంత ఆలస్యమవుతుంది. దానికి Planning Commission వారి అనుమతి తీసుకొంటే, వారు ఆలస్యమైనా ఫరవాలేదని ఒప్పుకొంటే మాకేమి ఆక్షేపణలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—తుంగభద్ర High Level Canal కు మొత్తము ఈ 6 సంవత్సరములలో ఏడుకోట్లు ఖర్చుపెట్టడానికి అంగీకరించారు అని చెప్పారు. మొత్తము ఖర్చు 19 కోట్లు అవుతుందని అనుకొంటాను. అంటె మూడు five year plan వరకు ఇది ఇట్లే జరుగుతుందన్న మాట. అట్లు లేకుండా, దీనిని expedite చేసి మనం శ్రద్ధతీసుకొని పనిచేసినట్లయితే రెండు ప్రణాళికలోనే పూర్తిచేసేందుకు అవకాశమున్నది. అదికూడ పరిశీలిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI.—ఒక ప్రాజెక్టును ప్రారంభించిన తరువాత దానిని చాలాకాలము prolong చేయడం చాలా ప్రమాదము కాబట్టి దాన్ని త్వరగా పూర్తిచేయాలనే planning Commission వారి ఉద్దేశము కూడ. అక్కడ Deputy Chairman గారుకూడ మాతో చెప్పారు. ప్రాజెక్టు ప్రారంభించినప్పుడే allotment ఇస్తాము. మీరు ఇంకా త్వరగా చాకచక్యంగా పని ప్రోత్సహించి చేస్తే తరువాత Second Five Year Plan లో ఇంకా ఎక్కువ మొత్తము allot చేయడానికి ప్రయత్నం చేస్తామని వారు మాకు చెప్పారు. కాబట్టి ఎక్కువ కాలము, 15 ఏళ్ళవరకు తీసుకోవలసిన అవసరంలేదు. 8, 10 ఏళ్ళలోపలనే ఈపని పూర్తిచేయవచ్చునని ఆశిస్తున్నాము.

MR. SPEAKER : Questions Nos. 472 and 472 (A) will be taken up together.

*Relaxation of age rule for inclusion in the list of Deputy Tahsildars.*

472—

*926 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Minister for Revenue be pleased to state the number and the names of persons who were included in the list of Deputy Tahsildars and are working on 30th June 1955 after exemption from age-limit ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

Sri G. Ayyanna of the East Godavari District is the only candidate who was included in the approved list of Deputy Tahsildars after relaxing the age rule in his favour and who was working as Deputy Tahsildar on 30th June 1955.

*Inclusion of Upper Division Clerks in the List of Deputy Tahsildars.*

472-A—

*447 Q.—SRI P. VENKATASUBBAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether it is a fact that the Upper Division Clerks who are fit for promotion as Deputy Tahsildars should be within 40 years of age for inclusion in the list of Deputy Tahsildars; and

(b) whether this restriction has been relaxed to 45 years in the case of those that would have been promoted in the past but for the Communal G.O.?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative

(b) Formerly cases of Upper Division Clerks who could not be appointed as Deputy Tahsildars before they were 40 years of age, because of the working of the "Communal rotation" were being considered for inclusion in the list of

Deputy Tahsildars, upto the age of 45 years. Though "Communal rotation" is no longer in force deserving cases are being considered for relaxation of the age rule, upto the age of 45 years.

SRI M. RAJESWARA RAO : Will the Hon. Minister be pleased to state whether the Government have prescribed any special condition that a penson should satisfy before he qualiFies for such exemption from age limit ?

THE HON. SRI K. CHANDRAMOULI :—దానికైతే 45 years వరకు age limit exempt చేయడానికి అవకాశమున్నదని చెప్పాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Deserving cases లో age limit exempt చేస్తామని చెప్పారు. అయితే మొదటిదానికి సమాధానం చెప్పుతూ ఇంతవరకు ఒకతనికే చేశామని చెప్పారు. అంటే ఒకే ఒకతనే deserving అని అర్థమా లేక ఇంక ఎవరికైనా చేశారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ తారీఖువరకు ఒకరిని చేశామని చెప్పానే గాని తరువాత చేయలేదని గాదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అయితే ఇంత వరకు ఎంతమందిని exempt చేశారో చెప్పగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI .—నాకు తెలిసినంతవరకు తరువాత ఇంకొకరిని, A.C. Guruvulu of Visakhapatnam అనే అతన్ని చేశాము.

SRI P. VENKATASUBBAYYA :—Communal G.O. operation లో ఉన్నప్పుడు, తహశీల్దార్ lists లోకి రానటువంటి వారికికూడ age relax చేసి 45 వరకు పెట్టి, కొంతమందికి అస్పదం కలుగజేసినట్లు చెప్పుతున్నారు. అందరికి general గా 45 సంవత్సరాలని, rule ఎందుకు పెట్టకూడదు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Deserving cases అని ఉన్నదండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Deserving cases అంటే మొత్తం ఇప్పటివరకు, రెండు అటువంటివని లేక అన్ని కేసులు ప్రభుత్వ దృష్టికి తీసుకురాబడలేదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇంకా ఎంతమంది ఉన్నారని వేరే ప్రశ్న వేస్తే చెప్పవచ్చు.

P. SUNDARAYYA :—తూర్పు గోదావరి జిల్లాలో ఒకరికి Deputy Tahsildar గా appoint చేసేందుకని exemption ఇచ్చారని చెప్పారు. వారిని ఊరకంగా permanent గానో temporary గానో appoint చేసినప్పుడు, seniority ని గుర్తించకుండా చేసినట్లు ప్రభుత్వ నోటీసుకు వచ్చిందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—లేదండి.

SRI S. VEMAYYA :—నలభై సంవత్సరాల వయస్సులోపల రివిన్యూ రిపోర్టులో వున్నవారు వీరు సకాలములో tests ప్యాసు అయినప్పటికినీ, వారిని Deputy Tahsildar list లో చేర్చకుండా వుండినందువల్ల, వారు over age క్రిందకు వస్తారు. కాబట్టి ప్యాసు అయినవారిని లిస్టులో చేర్చినా చేర్చకపోయినా, అటువంటి age restriction లేకుండా, వారికి ప్రమోషను యివ్వటానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Age restriction లేకుండా చేయలేము.

### *State Planning Advisory Committee.*

473—

*170 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government constituted the State Planning Advisory Committee; and

(b) if so, the non-official members on it ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Yes, Sir.

(b) Sri Alluri Satyanarayana Raju, M.P.

Sri N. G. Ranga, M.P.

Sri B. S. Murthy, M.P.

Sri T. Bhaskara Rao, M.P.

Sri R. B. Ramakrishna Raju, M.L.A.

Sri P. V. R. Gajapathi Raju, M.L.A.

Sri P. Sundarayya. M.L.A.

Sri Shaik Md. Rahamtullah, M.L.A.

Prof. M. Venkata Rangaiah.

Sri H. Sitharama Reddi

Sri V. Ramakrishna.

Sri J. V. Somayajulu.

Sri Bikkani Venkata Ratnam.

Sri Nivarti Venkata Subbaiah.

Sri Kukati Kodanda Rama Reddi.

Mrs. A. C. Krishna Rao.

Sri Meduri Nageswara Rao, M.L.A.

Sri Y. Anthony Reddi, M.L.A.

Sri Guntur Narasimha Rao.

SRI S. VEMAYYA :—సంవత్సరములో యీ కమిటీ ఎన్ని పర్యాయములు, వారు అక్కడ కూర్చుని చర్చిస్తున్నది ? దానికి ఏదైనా ఒక విధానాన్ని ప్రభుత్వము సూచించినదేమో తెలియజేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు ఒకసారి సమావేశము అయింది. మళ్ళీ ప్లానుయొక్క స్వరూపము తయారైనప్పుడల్లా, సమావేశమవుతుంది. ఈవిధంగా అవసరము వచ్చినప్పుడల్లా సమావేశము అవుతుంది. ఇది standing కమిటీకాదు. ఇది Consultative Committee. అంటే సలహా సంఘము అనే సంగతి సభ్యులు గుర్తించాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ప్రభుత్వము యే basis మీాద యీ మెంబర్లను నియామకము చేశారు ?

THE HON. SRI K. VENKATA RAO :—దానికి basis చెప్పటానికి శాసనము యేమీాలేదు. మంత్రిగారియొక్క మనోప్రవృత్తినిబట్టి, దేశముయొక్క అవసరాన్నిబట్టి, వేశాము.

Sri L. LAKSHMANA DAS :—మంత్రిగారు చదివిన మెంబర్ల పేర్ల లిస్టునుబట్టి చూస్తే, కొన్నిజిల్లాలకు కేవలము ప్రాతినిధ్యము లేకుండా వున్నది. అందువల్ల అన్నిజిల్లాలకు ప్రాతినిధ్యము ఉండేటట్లుగా మెంబర్లను వేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ కమిటీ జిల్లాలకు ప్రాతినిధ్యము కోసము ఏర్పరచిన కమిటీకాదు. ప్రతిజిల్లాకు ఒకకమిటీ వుండనే వున్నది. ఒక్కొక్క ప్రత్యేకమైన విషయములో ప్రావీణ్యతవున్న ప్రముఖులను appoint చేయడముకోసమే యీకమిటీ ఏర్పాటు చేయబడ్డది.

SRI K. SUBBA RAO :—మంత్రిగారు చదివినపట్టిలో భాస్కరరావు గారి పేరువున్నది. వారు మద్రాసు M. P. గా వున్నారు. గనుక వారికంటే ప్రతిభావంతులుగావున్న యం. పి. లు యితరరాష్ట్రాలలో వున్నారే, అటువంటివా రందరినీ చేర్చటానికి అవకాశమువున్నదా ? లేకపోతే ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన పార్లమెంటు సభ్యులుగాని లేకపోతే, ఆంధ్రరాష్ట్రములో దేశవ్యవహారములు నడిపే వారిని మాత్రమే చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇందులో నలుగురు అయిదుగురు యం. పి. లు వున్నారు. భాస్కరరావుగారిని వేసుకోవడములో, మనకు పెట్టుబడిలేనందున, పెట్టుబడి సంపాదించే సమర్థత వారికి వున్నది గనుక వారిని వేసుకుంటే లాభకరంగా వుంటుందని అపేక్షించి వేసుకున్నాము. ఇది మన లాభంకోసము వేసుకున్నదే. అంతే కాని, యితర రాష్ట్రములలో వున్న బుద్ధి కుశలతలన్నీ కూడా లేపాక్షిదగ్గర concentration కోసము యీ కమిటీని వేయలేదు.

SRI A. VENKATARAMA RAJU :—ఈ మెంబర్లసంఖ్య యింకను పెంచటానికి అవకాశమువున్నదా ? ఉంటే, కొణిగట్టం కొండయ్యగారిలాంటివారు కూడా యిందులో వుండడము అవసరమని ప్రభుత్వము అభిప్రాయపడడము లేదా?

THE HON. SRI K. VENKATA RAO :—కొణిగట్టం కొండయ్య గారు ఒకవిషయములో పనిచేస్తున్నారు. వారిసలహా విషయంలో తీసుకుంటున్నాము. ఇది planning విషయములో సలహా యివ్వటానికి యీ కమిటీని వేశారు. గనుక ప్లానింగుకు సలహాకేకాని ఇండస్ట్రీసుకుకాదు.

SRI P. SREERAMULU :—ఈ కమిటీ నియామకములో మంత్రిగారి మనఃప్రవృత్తి యీ ఎసెంబ్లీసభ్యులలో యింతమందిని నామినేటు చేయటమనేవిషయం ఏదైనా నిర్ణయము వున్నదా ?

THE HON. SRI K. VENKATA RAO :—కమిటీ మెంబర్లసంఖ్యను గురించి యేమీ నిర్ణయము లేదుగాని మన ప్రతిపక్షనాయకులను ముగ్గురిని మనపార్టీలో కొన్నివిషయాలల్లో వారియొక్క అనుభవమును ప్రదర్శించటానికి వీలుగావుంటేవారిని యీ కమిటీలో వేసుకున్నాము.

SRI P. SATYANARAYANA :—మధ్యతరగతి ప్రజలకు కుటీర పరిశ్రమలకు ప్రాతినిధ్యము వుండడానికి క్రొత్తగా ఎవరినైనా యిందులోనికి తీసుకోటానికి అవకాశమున్నదా?

THE HON. SRI K. VENKATA RAO :—కుటీరపరిశ్రమలకు, మధ్యతరగతి ప్రజలకుగాను ప్రత్యేకంగా బోర్డువున్నది. అది శాసనబద్ధం కాదు. శాసనబద్ధముకూడా చేయబోతున్నాము. అంతేకాకుండా Industries Advisory Board అనేది ఇంకొకటివున్నది. దానిలోకూడా వారు అనుకున్న వారియొక్క ప్రాతినిధ్యము పూర్తిగా నేవుంది. అవసరాన్నిబట్టి ఎవరైనా ప్రావీణ్యత, బుద్ధికుశలత చూపించినా, ఒకవేళ వారు తమ అనుభవాన్ని ఇస్తామనిచెప్పితే, ప్రభుత్వము తప్పకుండా వారిసలహా తీసుకుంటుంది. అంతేగాని కమిటీలోనే వుండవలసిన అగత్యము లేదు. అటువంటివారు సలహా ఎప్పుడుయిచ్చినను, అప్పుడు స్వీకరించటానికి నాకు అభ్యంతరము లేదు. ప్రభుత్వముకూడా సిద్ధంగా నేవుంది.

SRI S. BRAHMAYYA .—ఈ ప్రణాళిక సలహాసంఘంలో ప్రత్యేక ప్రాముఖ్యతగల వ్యక్తులను వేశామని అన్నారు. ఆ వ్యక్తుల ప్రాముఖ్యత ఏమిటో తెలియజేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నాకు అభ్యంతరములేదు. ఒక్కొక్కరికి biography వ్రాయమంటే వ్రాసిపెట్టుతాను. కొంచెము అది హిందీలోగూడా వ్రాయమనిఅంటే, అప్పుడు బ్రహ్మయ్యగారి సలహాగూడా కావలసి వుంటుంది.

Sri P. GOPALU REDDI :—అధ్యక్షా, పెట్టుబడి నిమిత్తము భాస్కరరావుగారిని సభ్యులు వేసుకున్నామని అన్నారు. మాచిత్తూరుజిల్లాలో మేము పెట్టుబడి పెట్టుకోలేని పరిస్థితిలో వున్నాము, కాబట్టి మాజిల్లాలో ఒక sugar factory పెట్టటానికి భాస్కరరావుగారికి ప్రభుత్వమువారు సిపార్సు చేస్తారా?

THE HON. Sri K. VENKATA RAO :—చిత్తూరు జిల్లాలో గోపాలరెడ్డిగారికి తెలియకుండానే sugar factory పెట్టమని అప్పుడే రెండుదరఖాస్తులు వచ్చాయి. ఒకటి మన శాసనసభలో ప్రముఖ సభ్యులైన నాదముని రెడ్డిగారి వద్దనుంచి, యింకొకటి Changalaraya Naidu, తిమ్మారెడ్డి వగైరాల పెద్దలనుంచి వచ్చినవి. ఈ రెంటిలోనూగూడా గోపాలరెడ్డిగారిని ఎందుకు చేర్చుకోలేదో నాకు తెలియదు.

30th September 1955]

SRI P. RAMACHARLU :—మంత్రిగారి మనఃప్రవృత్తి మార్పుసూచనలు కన్పిస్తున్నాయా ?

THE HON. SRI K. VENKATA RAO :—అది అంత త్వరగా మారేటట్లుగావుంటే అస్తమానం నేనుకూడా పార్టీలు మార్చేవాణ్ణే.

*Amenities provided to the workers in the factories.*

474—

*193-A Q.—SRI S. VEMAYYA . Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state the names of the factories in which (a) housing accommodation, (b) education; and (c) other amenities are provided to the workers in the State now ?

THE HON. SRI G. LATCHANNA :—

A statement showing the particulars is placed on the table of the House.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఇక్కడ House లో Table మీద పెట్టిన వివరాలలో మొట్టమొదటిలో 1242 యిళ్లు కట్టారని చెప్పుచున్నారు. అవి ఏపి మాదిరి యిళ్లు ? ఇందులో పదియవ అయిటములో ఒక shed కట్టినట్లుగా కూడావున్నది. కట్టినవన్నీ sheds మాదిరివా ? లేక pucca houses కూడా వున్నవా ?

THE HON. SRI L. LATCHANNA :—అన్నిరకాల యిళ్లు వున్నాయండి.

*Cancer clinics in the State.*

475—

*264 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there are proposals with the Government to start cancer clinics in the State; and

(b) if so, when and where ?

Vide appendix at page 138 infra.

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The answer is in the negative.

(b) This does not arise.

SRI S. VEMAYYA :—ఈ Cancer జబ్బు చాలా విపరీతముగావుంది కాబట్టి, దీనికి treatment కొరకు వెంటనే తగుమైన ఏర్పాటు, వసతి మన రాష్ట్రంలో కలుగజేయటానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—Cancer జబ్బుకు treatment లేదని చెప్పడములేదు. చాలా హాస్పిటల్సులో Cancer treatment కు యిప్పటికే ఏర్పాట్లువున్నవి. గుంటూరులోనూ, విశాఖపట్టణములోనూ, District Headquarter hospitals లోనూ ఏర్పాటు చేయబడ్డది. కాని దానికి ప్రత్యేకంగా వసతి ఏర్పాటు చేయటానికి లక్షలకొద్ది డబ్బు ఖర్చుచేయవలసివుంటుంది. మనకువున్న హాస్పిటల్సే improve చేయలేనిస్థితిలో మనమువున్నాము. అందువల్ల దానికి ప్రత్యేక హాస్పిటల్ నిర్మించటానికి ఆర్థికంగా శక్తిలేదని మనవి చేస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—హైదరాబాదులో యిటువంటిది ఒక Cancer hospital పెట్టటానికి ఆంధ్రప్రభుత్వముయొక్క సహాయ్యము కోరినట్లుగా ఒక పర్యాయము యీ శాసనసభలో మంత్రిగారు చెప్పారు. అటువంటి సందర్భములో మన రాష్ట్రము తరఫునగూడా అక్కడ కొన్ని సీట్లను రిజర్వుచేయటానికి, ప్రభుత్వము డబ్బు ఏదైనా కేటాయిస్తున్నదా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఆ విషయము నాకు తెలియదు. పాత files తిరగవేసిచూచి సమాధానము చెబుతాను.

*Offences detected by Regional Transport Officers, etc.*

476—

***245-A Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state the number of offences detected by (1) Regional Transport Officers, and (2) Motor Vehicles Inspectors in the State for the year ending 1954 ?**

30th September 1955]

THE HON. SRI D. SANJIVAYYA :—

The particulars are furnished below :

(1) Number of offences detected by Regional Transport Officers ... 4137

(2) Number of offences detected by Motor Vehicles Inspectors ... 4044

SRI S. VEMAYYA :—ఈ కేసులవల్ల ప్రభుత్వానికి ఏదైనా ఆదాయము వస్తున్నదా ? వస్తే, సంవత్సరానికి ఎంత ఆదాయము వస్తున్నది ?

THE HON. SRI D. SANJIVAYYA .—ఈ కేసులవల్ల ప్రభుత్వానికి ఏలాంటి ఆదాయమురాదు. Overload cases వుంటే దానికి suspend చేస్తున్నాము. ఇందులో operator కు నష్టము వస్తుందికాని ప్రభుత్వాకి ఏ మాత్రముగూడా లాభమురాదు.

SRI S. VEMAYYA :—Transport Department వారు తీసుకునేది ఒకచర్య అయితే, పోలీసుడిపార్టుమెంటువారు మరొకచర్య తీసుకొంటున్నారు. అందువల్ల ఒకేతప్పుకుగాను యిద్దరుచేరి ఒక కేసుపెట్టి, రెండింటికి వేరే వేరే శిక్షలు యిప్పిస్తున్నారు. ఇందువల్ల ఆ అపరేటరు రెండుశిక్షలు అనుభవిస్తున్నాడు. ఈ విషయము ప్రభుత్వానికి తెలుసునా ? ఆ విధంగా కాకుండా తప్పులు ఎన్నివున్నా ఒకే punishment యివ్వటానికి ప్రభుత్వము ఎదైనా ఒకవిధానంకోసం పూనుకుంటుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—చట్టములో ఆవిధంగా వున్నది. చర్యతీసుకోవడములో సివిల్, క్రిమినల్ రెండు రకాలుతీసుకునేటట్లుగా వున్నది. ఇప్పుడు ఉదహారణకు Co-operative Societies వున్నవనుకోండి. వాటిలోడబ్బు అపహరించినవారికి misappropition కు గాను criminal చర్య, డబ్బు recover చేయటానికి civil చర్య రెండు రకాలు చర్యలువున్నవి. అందువల్ల ఒకేపద్ధతిని జరగాలంటే, అది సాధ్యము కాదు.

Sri A. VENKATARAMA RAJU :—Workers మీదవచ్చే disputes కు గాను త్రైపక్షు committee ఒక దానిని వేసినట్లు తెలుస్తున్నది. ఈ కమిటీనివేసి యిప్పటికప్పుడే ఆరుమాసాలు అయింది. ఇది ప్రకటించ లేదని తెలుస్తున్నది త్వరలో ప్రకటించటానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఈ విషయము కార్మిక సంఘాలన్నిటికినీ తెలుసు. ఆ విషయమువారిని ప్రశ్నిస్తే వారే సమాధానము చెబుతారు.

SRI G. RAMI REDDI :—ఈ కేసులలో బస్సులను suspend చేస్తే బస్సుయజమానులకు నష్టము, ప్రజలకు కష్టము కలుగుతున్నది. ఆ విధంగా చేసే బదులు, ఒకే పద్ధతిన వారికి fine వేస్తే, ప్రభుత్వానికి ఆదాయముకూడా వస్తుంది గనుక, యీ విషయము ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Bus యజమానులను suspend చేయడములేదు. బస్సులను suspend చేస్తున్నాము. బస్సులను suspend చేస్తే, ప్రజలకు యిబ్బంది. కలుగుతున్నమాట నిజమే. అందువల్ల బస్సు operatorకే 500 రు పాయిలు fine వేసే రకంగాచేసి, బస్సులను నడుపుతూ ఉండేటట్లుచేస్తే ప్రజలకు inconvenience వుండదు అయితే యే మార్పులు అవసరమైనా Government of India వారు చేయవలసినదే. ఎందుకంటే, దీనికి సంబంధించిన చట్టము Government of India వారు చేసింది. ఈ విషయము వారికి వ్రాసి వున్నాము. వారు ఏమిచేసినదీ, యింకా తెలియలేదు. ప్రతిరాష్ట్రమునుంచికూడా వారికి ఏఏ యిబ్బందులు వున్నవో అవన్ని విచారించి, ఒక సమగ్రమైన మార్పులతో ఒక చట్టము తీసుకొని రావాలని కేంద్రప్రభుత్వమువారు ఉద్దేశిస్తున్నారు.

SRI P. VENKATASUBBAYYA :—ఈ కేసులన్నీకూడా ఈ Regional Transport Inspectors, Motor Vehicles Inspectors కనిపెట్టినవేనా లేక Police Inspectors, Head-constables, Constables కనిపెట్టినవికూడా వున్నాయా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ప్రశ్న వారు చదవలేదను కొంటాను.

"The number of offences detected by (1) Regional Transport officers, and (2) Motor Vehicles Inspectors in the State for the year ending 1954 ?"

అని ప్రశ్నవున్నది. దానికి జవాబు చెప్పాను. ఈ పోలీసు ఆఫీసర్లు పట్టు కొన్న కేసులను గురించి ఇంకొక ప్రశ్నవేస్తే సమాధానము చెబుతాను.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఈ 8 వేలుపైగా కేసులు పెట్టినాయి. ఇందులో ఎన్ని బస్సులను suspend చేశారు. ఎంతకాలము చేశారు,

THE HON. SRI D. SANJIVAYYA :—ఆ details అన్నీ ఇక్కడ లేవు. 15 రోజులో, 20 రోజులో, ఒక నెలో, రెండు నెలలో suspension అవుతూనే వుంటాయి.

*Taxation Enquiry Committee's Report.*

477—

*815 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Chief Minister be pleased to state whether the Government have considered the Taxation Enquiry Committee's Report and what are the proposals of the State Government ?

THE HON. SRI B. GOPALA REDDI :—

The Report of the Taxation Enquiry Commission is under consideration.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Taxation enquiry కమిటీ మొత్తము proposals కాకపోయినా సమ్మరీ అయినా మెంబర్లకు అందజేస్తారా ? వాటిని అన్నింటినీ వీరు consider చేసేందుకు వీలవుతుందా ? Local Boards కు కొన్ని వనరులు యీ కమిషనువారు allot చేశాము అన్నారు. అవి ఇచ్చే సంగతికూడా వీరు ఏమైనా ఆలోచిస్తున్నారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—మేము అంతా ఆలోచిస్తాము. అవన్నికూడా అసెంబ్లీ ముందుకు తీసుకువచ్చి ఆమోదము అయ్యేవరకు consideration లో వున్నాయని చెప్పవలసి వున్నది. మా consideration పూర్తి అయింది. అవి చట్టము అయ్యేవరకు consideration లో వున్నదని చెప్పవలసివున్నది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఆ Taxation Enquiry కమిటీ రిపోర్టు మెంబర్లకు అందజేయడానికి పూనుకుంటారా ? అందులో ముఖ్యమైన documents వున్నాయి.

THE HON. SRI B. GOPALA REDDI :—లైబ్రరీలో చాలాకాలము క్రిందటనే కాపీలు పెట్టినాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :—లైబ్రరీలలో వున్న కాపీలు మెంబర్లు అందరూ చదువుకోవాలంటే చాలవు కాబట్టి అక్కడ కాపీలు ఎక్కువ చేయడమో లేక మెంబర్లకు సప్లయి చెయడమో చేస్తారా ?

MR. SPEAKER : There is no complaint to me that the copies are not supplied.

*Expenditure incurred on Prisoners outside the State.*

478—

*498 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the amount of money spent on prisoners who are outside the State for want of accommodation in our jails for the year 1953-54; and

(b) the number of such prisoners ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) The amount of money spent on prisoners including inmates of Certified Schools and Borstal Schools outside the State is under scrutiny and check. The approximate figures are as follows :

| Name of the State. | Period. | Amount. |
|---|---|---|
| | | Rs. |
| Prisoners etc. in Mysore | 1953-54 | 2,50,877 |
| Prisoners etc. in Madras | 1—10—1953 to 31—12—1954 | 1,19,391 |
| Prisoners in Other States on account of ex-Military prisoners. | 1953-54 | 43—7—6 |

(b) The average number of prisoners and inmates of Certified Schools and Borstal Schools outside the State during 1953-54 was 6,600.

SRI S. VEMAYYA :—మన ఖైదీలు ఇతర రాష్ట్రములలో వున్నందు వల్ల మనకు డబ్బు ఎక్కువ ఖర్చు:అవుతున్నది. అందువల్ల వీరందరికికూడా వసతి మన

రాష్ట్రములోనే కలిగించి ఆ డబ్బు ఇతర రాష్ట్రములకు పోకుండా వుండే దానికి ప్రభుత్వము ఏమైనా ప్రయత్నిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—గడచిన సంవత్సరము దానిని గురించి ఆలోచనలు జరిపాము. అంతలోపలనే మన ఖైదీలను అందరినీ వదలివేయడమువల్ల జైళ్లు చాలా ఖాళీ అయినాయి. కాబట్టి కొత్త జైళ్లు కట్టుకోవడము కొద్దిగా ఆలస్యము అయింది. ఇప్పుడు నెల్లూరులో ఆడఖైదీ లందరిని రాజమండ్రికి మార్చడము జరిగింది. అక్కడనే close prison ను seperate గా ఏర్పాటుచేసి అక్కడ స్త్రీలందరినీ మార్చినారు. ఇంకా బళ్ళారిలో మిగిలిన ఖైదీలను కొత్తగా మనము జైళ్లు కట్టుకున్న తరువాత మార్చుకోవాలి. ఇప్పుడు బాపట్ల దగ్గర ఒక జైలు కట్టాలని ఆలోచనలో వున్నది. అక్కడక్కడ మిగిలిన ఆలోచనలు జరుగుతున్నవి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— క్రిందటి పర్యాయము ఇలాంటి ప్రశ్నకు సమాధానం చెబుతూ జైల్సుమీద ఇచ్చినటువంటి advisory కమిటీలో వున్నటువంటి సూచనలను ముఖ్యమైన వాటిని అయినాసరే implement చేయడానికి మంత్రివర్గము ఆలోచిస్తున్నదని సంజీవరెడ్డిగారు చెప్పారు. అది ఎంతవరకు అభివృద్ధి చెందిందో మంత్రిగారు చెబుతారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—చెప్పి వుంటాను అనుకోండి జ్ఞాపకము లేదు. అయినా అప్పుడు చెప్పివుంటే ఆలోచన జరుగుతూనే ఉంటుంది.

SRI S. NARAYANAPPA :—అనంతపురం దగ్గర open జైలు కట్టాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నట్లు వివరాలు తెలుసుకున్నాము. అది ఎంతవరకు వచ్చింది. త్వరలో ఆ ప్రయత్నము జరుపుతారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—నాకుకూడా ఆలోచన బాగానే ఉన్నది. మంచి భూవసతి, నీటి వసతి వున్న చోట ఇలాంటి ఖైదీలందరిని అక్కడ నేవుంచే బదులు ఇలాంటి చోటు వదలిపెడితే వారు వుపయోగ్గపడుతారేమో. మనుష్యులందరిని ఈరకంగా వాడే బదులు వారికి ఉత్పత్తి జరిగేట్లువారికి జీవితంలో వుపయోగపడేట్లు ఏదైనా చేస్తే బాగుంటుందేమో అని ఆలోచనలోవున్నవి. ఎంత వరకు వచ్చింది అంటే నేను చెప్పలేను. I. G. of prisons దగ్గరనుంచి ఇంకా ఎటువంటి స్కీము రాలేదు. రాగానే దీనిని పూర్తిచేయాలని మా ఆశ.

SRI B. APPA RAO :—బళ్ళారి సమస్య తేలబోతున్నది కాబట్టి ప్రభుత్వం ఈ జైళ్ళ సమస్యమీద తాత్కాలికంగా ఏమీ కొత్త జైళ్లు కట్టడము నిలుపు చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI .—నిలుపుదల చేయాల్సిన అవసరములేదు. బళ్ళారి రహస్యం ఈపాటికి ఢిల్లీలో బయటపడివుంటుంది. 30 వ తేదీ నివేదిక ఢిల్లీ గవర్నమెంటుకు సమర్పించి వుంటారు. కాబట్టి 2,3 రోజుల్లో ఆ కాపీ ఆంధ్ర ప్రభుత్వానికికూడా రావచ్చును. అంతలోపల కట్టేదిగాని, పూర్తి చేసేదిగాని వుండదు కాబట్టి ఏమీ ప్రమాదములేదు.

SRI S. VEMAYYA :—షోలాపూరు దగ్గర మన రాష్ట్రానికి సంబంధించినటువంటి సర్టిఫైడ్ స్కూల్లో ఒకరు వుంటేవాళ్ళ తలిదండ్రులు ఉత్తరము వ్రాసుకొన్నాకూడా అక్కడనుంచి జవాబు రావడములేదు. మన రాష్ట్ర ప్రభుత్వముద్వారా ఏదైనా చేసుకొనే దానికి ఏదైనా వసతివున్నదా ? లేకపోతే ఆ వసతిని కలుగ చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—షోలాపూరులోవున్నట్లు నాకు ఎక్కడా ఏ లిస్టులోనూ కన్పించలేదు. అయినా నేరము చేయాలంటే మనకు ఇంత రాష్ట్రమువుంటే అక్కడపోయి ఎందుకు నేరముచేయాలి.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, మనము ఇప్పుడు అనేక ప్రాజెక్టులు కట్టుతున్నాము కదా అక్కడే ఆ open జైల్సుపెట్టి వాళ్లచేత అక్కడ పనులు చేయిస్తే వాళ్లు కొంత గడించుకొనుటకు వీలుంటుంది గదా ? ఆ విషయం ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—అందుకే ఇప్పుడు నేను చెప్పాను. Experimental గా ఒకచోట చేసిచూస్తాము. అది బాగా ఫలిస్తే తతిమ్మాచోటుకూడా ఆ విధంగా తప్పకుండా చేస్తాము. అనవసరంగా వాళ్లను ఒకచోట lock up చేసే బదులు ఎక్కడఅయినా వారిని వుపయోగించుకొనవచ్చును.

SRI B. SANKARAIAH :—2, 3 గురు వుండేటటువంటి రాజమండ్రి జైల్లుగదుల్లో 15, 16 మందిని వుంచుతున్నారు. అందువల్ల అందులో వున్నవారికి చాలా కష్టంగా వున్నది. ఈ విషయం క్రిందటి పర్యాయముకూడా మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చాము. బీడీలు, ఇంకా ఇతర సంస్కరణలు ఆలోచిస్తామని చెప్పారు. వాటివిషయం వెంటనే చర్య తీసుకుంటూరా ?

30th September 1955]

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ సంస్కారణలను గురించి పూర్వమునుంచి ఆలోచన జరుగుతునే ఉన్నది. ఇప్పటికీ జరుగుతోనే వున్నది. ఇకముందుకూడా జరుగుతోనే వుంటుంది.

*Import of raw silk for distribution to weavers.*

479—

*281 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the quantity of raw silk imported and distributed to the weavers of this State for the year ending 1954 by the State, and

(b) the names of the countries from which the silk is imported ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) No raw silk was imported by this State.

(b) This does not arise.

SRI P. SATYANARAYANA :—మన ఆంధ్రరాష్ట్రములో సంవత్సరానికి 75 లక్షలు విలువగలిగినటువంటి సిల్కువస్త్రాలు తయారవుతున్నాయి. ఇప్పుడు సెంటరులో ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకమైనటువంటి ప్రాతినిధ్యము లేక ఇక్కడవుండే ఇబ్బందులు వారికి తెలియడము లేదు. దానికి ఆంధ్రప్రభుత్వము కృషిచేసి సెంటరులో సిల్కు పరిశ్రమకు ప్రాతినిధ్యము సంపాదిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:— ప్రాతినిధ్యము సంపాదించడానికి ధరఖాస్తులు పెట్టుకుంటే పూర్వము రోజులలాగా రావు. మనకు అవసరమువుంటే ఎక్కువగా మనం సిల్కు వినియోగించుకోవడము వుపయోగించుకొన్నట్లయితే మనకు ప్రాతినిధ్యం లభిస్తున్నది. ఆంధ్రరాష్ట్రములో ధర్మవరములో సిల్కు ప్రోత్సహించడానికి సెంటరులో స్థాపించడముకోసము ఇండియా ప్రభుత్వము నిర్ణయించినట్లు తెలుసును. మేముకూడావారికిచెప్పి తగినచర్య తీసుకుంటాము.

*Cases filed by the District Welfare Officer, Cuddapah, under Civil Disabilities Act.*

480—

*450 Q.—SRI P. VENKATASUBBAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to

state the number of cases filed by the District Welfare Officer, Cuddapah in the year 1954-55 under the Civil Disabilities Act ?

THE HON. SRI K. VENKATA RAO :—

No cases were filed during 1954-55 by the District Welfare Officer, Cuddapah under the Civil Disabilities Act.

SRI P. VENKATASUBBAYYA:—District Welfare Officer ఉద్యోగ ధర్మమైనప్పుడు ఆయన ఈ పనిచేయునందుకు ఆయనమీద చర్య తీసుకుంటారా ప్రభుత్వం ?

THE HON. SRI K. VENKATA RAO :—ఆయనకు కేసులు దొరక లేదేమో.

*Untouchability Removal Act in Andhra State.*

481—

*1470-A Q.—SRI P. VENKATASUBBAIAH : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether the Untouchability Removal Act enacted by the Central Government is in force in the State of Andhra ; and

(b) if so, from which date it has come into force ?

THE HON. SRI K. VENKATA RAO :

(a) Yes, Sir

(b) From 1—6—1955.

SRI S. VEMAYYA :—అస్పృశ్యతా నివారణ చట్టం చక్కగా అమలు జరుగడానికి మధ్యపాననిషేధం అమలు పోలీసుశాఖకు అప్పగించినట్లే దానిని అమలు చేయడంకూడా పోలీసుశాఖకు అప్పగించడానికి పూనుకుంటారా ?

THE HON. Sri K. VENKATA RAO :—అటువంటి చర్య తీసుకో దలచుకో లేదు.

SRI P. VENKATASUBBAYYA :—ఈ Act గెజెట్‌లో ఇంగ్లీషులో publish చేస్తారు. దానిని తెలుగులో publish చేసి ప్రచారములకు ఇస్తే బాగా ప్రచారం చేయడానికి వీలు అవుతుంది. అట్లా చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రభుత్వానికి ఏమి అభ్యంతరం లేదు. కాని ప్రభుత్వ translation అయితే మళ్ళీ ఇంగ్లీషులో చెబుతుండాలి. సుబ్బయ్యగారివంటి కవులు translate చేసి draft ఇస్తే అచ్చువేయించి పంచిపెడతాము.

*Amount incurred towards rent for the offices at Madras.*

482—

*979 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Chief Minister be pleased to State the total amount of expenditure incurred by the Government up to 31st March 1955 towards rent for each of the Offices of the Andhra Government at Madras ?

THE HON. SRI B. GOPALA REDDI :—

The information is placed on the table of the House.

SRI M. RAJESWARA RAO :—మద్రాసు ఆఫీసులపై ఇంకా ఎక్కువ ఖర్చుఅవుతున్నప్పుడు ఈ రెండు సంవత్సరాలలో వాటిని ఆంధ్రప్రాంతానికి మార్చడానికి ప్రభుత్వానికిఉన్న అభ్యంతరాలు, ప్రతిబంధకాలు ఏమిటి ? ఎంత తొందరలో వాటిని యిక్కడకు మార్చడానికి ప్రయత్నం చేస్తారో సెలవిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ప్రభుత్వానికి ఎలాంటి అభ్యంతరమూ లేదు. కాని గుమాస్తాలకు వసతులు కలుగచేయవలసినబాధ్యత గవర్నమెంటుమీద ఉన్నది. ఒకేసారి ముఖ్యపట్టణానికి మార్చడంచేస్తే మంచిది కాని తలాకచోటికి మారిస్తే ఇబ్బందిఅవుతుంది. తగినవసతులు ఏపట్టణంలో కూడా లేవని భయంగావున్నది.

SRI. N. VENKAIAH :—వసతులుకలిగిన ప్రదేశాలలోనైనా వెంటనే ఆఫీసులు మార్చుచేయించడానికి ప్రయత్నిస్తారా ?

MR. SPEAKER :—వసతులులేవని చెబుతున్నారుకదా. Hypothetical question వేస్తున్నారు.

---

* Vide Appendix on Page 146 infra.

[30th September 1955

SRI S. VEMAYYA :—ప్రయత్నించి వసతులు చూపిస్తే ఆలోచిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆలోచిస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU .—ఆఫీసు లన్నీ కర్నూలులోనే పెట్టడానికి ఎక్కువకాలంపట్టే అవకాశం వున్నది కనుక కనీసం కొన్ని చిన్నఆఫీసులైనా, Commissioner of Labour వంటివి, తాత్కాలికంగానైనా వివిధపట్టణాలలో locate చేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా.

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ విషయం పరిశీలన జరిగింది. వివిధ పట్టణాలలోనికి మార్చేటట్లయితే ఇప్పుడున్న ఇబ్బందికన్న ఎక్కువ ఇబ్బంది అవుతుంది. ఇప్పుడువున్న ఆఫీసులన్నీ గుంటూరులోను, కర్నూలులోను, మద్రాసులోను ఉన్నాయి. అప్పుడు విశాఖపట్నంజిల్లా మొదలుకొని అన్ని పట్టణాలకు తరలిస్తే ప్రజలకు యింకా ఎక్కువ యిబ్బంది అవుతుంది.

SRI P. SREERAMULU :—అయినఆలస్యం ఎలాగాఅయింది ; విశాలాంధ్రవిషయం తేలేవరకు మద్రాసులో ఉంచితేనే ఆర్థికదృష్ట్యా మంచిదేమో ఆలోచిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI:—సంజీవరెడ్డిగారు ఇందాక చెప్పినట్లు, అన్నీ ఆలోచనచేస్తాము.

*Sangamvalasa—Adduruvalasa Scheme.*

483—

*605 Q.—SRI P. GUNNAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the investigation of Sangamvalasa-Adduruvalasa Scheme of damming Lothugadda has been completed ; and

(b) if not, when it is likely to be completed, and the execution of the work taken up ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) No such scheme is under investigation at present.

(b) Does not arise.

30th September 1955]

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, మంత్రిగారు చెప్పినదానికి చాలా సంతోషం. ఇది చిన్నస్కీము. లక్షరూపాయలతో రెండు, మూడువేల ఎకరాలకు సదుపాయం కలుగుతుంది. అయినా ఆలోచనలో లేదన్నారు. చాలా సంతోషం.

THE HON. Sri N. SANJEEVA REDDI :—శ్రీకాకుళం జిల్లాకు చాలా ఎక్కువ ఖర్చు అయినది. గతసంవత్సరం ఆంధ్రరాష్ట్రానికి యిచ్చిన 5 కోట్ల రూపాయలలో ఒకకోటి రూపాయలు శ్రీకాకుళం జిల్లాకు ఖర్చుఅయినది. ఈ సంవత్సరం 8 major projects తీసుకుంటే అందులో ఒకటి శ్రీకాకుళం జిల్లాకు ఉన్నది. పెద్దవిశోరి, మళ్ళా లక్ష రూపాయలు అంటే ఎక్కడనుంచి తెచ్చేది డబ్బు.

*Food adulteration cases detected from Batanila Flour dealers.*

484—

*505 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of food adulteration cases detected from Batanila flour dealers in the State; and

(b) the amount of fine imposed by the Courts in such cases for the year ending 1954 ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) 16. cases.

(b) The Court has imposed a fine of Rs. 725 in 14 cases. Two cases are still pending in the Court.

SRI S. VEMAYYA :—బరాణీపిండి ఇతరరాష్ట్రాలనుంచి వస్తుంది కాబట్టి అక్కడనే adulteration జరిగినట్లు తెలుస్తోంది. ఇక్కడ అమ్మేవాళ్లకు samples పంపి దానికి తేడావస్తే ప్రభుత్వం చర్యతీసుకుంటారా.

THE HON. SRI K. VENKATA RAO :—ఈఊహ ఇదివరకురాలేదు. ఇప్పుడు మెంబరుగారు చెప్పారు కాబట్టి పరిశీలిస్తాము.

*Nandivada Regulator.*

485—

*663 Q.—SRI P. NARASIMHAPPA RAO :

SRI K. PUNNIAH .—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether there is a proposal to take up the "Nandivada regulator" work in Palakonda taluk this year ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

Not this year. But it is proposed for inclusion in the Second Five Year Plan, if funds are available.

SRI P. NARASIMHAPPA RAO :—చాలా కాలంనుంచి దాని విషయంలో agitation చేస్తున్నారు. మంత్రిగారుకూడా వాగ్దానాలు చేసారు. Next Five year Plan లో అయినా take up చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—నారాయణపురం ఆనకట్ట కట్టవద్దని, నందివాడ కట్టమన్నారు. డబ్బు ఉంటే అన్ని కట్టడానికి సిద్ధంగా ఉన్నాము. రెండవ పంచవర్ష ప్రణాళికలో medium schemesకు ఎక్కువ ఇవ్వాలని అడిగాము. రెండుకోట్లు రూపాయిలుమాత్రం ఇచ్చారు. రాష్ట్రానికంతకు వీలైతే అన్నీ తప్పకుండా తీసికుంటాము.

Sri L. LAKSHMANA DAS:—ఇటువంటి చిన్న స్కీములలో ప్రజలు కొంత డబ్బు deposit చేస్తే ప్రారంభించడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—డబ్బు deposit చేస్తే కట్టడానికి మాకేమి భయం? తప్పకుండా ప్రారంభిస్తాము. అలా అయితే Government of India, Planning Commission చిక్కులు ఏవీ ఉండవు.

SRI L. LAKSHMANA DAS :—ప్రజలు ఇవ్వాల్సిన percentage గురించి చెప్పాను. మొత్తం అంతా deposit చేస్తే ప్రభుత్వం కట్టేది ఏమిటి—ప్రజలే కట్టుకుంటారు. 10%, 20% ప్రభుత్వంవారు నిర్ణయిస్తే దానిని deposit చేస్తే పని ప్రారంభించడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—1/3 వంతుకడితే Finance Department వారిని ఒప్పించటానికి వీలు ఉంటుంది. దానికి ప్రయత్నంచేయండి.

SRI P. NARASIMHAPPA RAO :—నందివాడ సీ హూకు లక్ష్మణ దాసుగారికి సంబంధం లేదు. తన విషయం కాకపోతే నెల్లూరువరకు వెళ్ళమన్నట్టు, పాతపట్నం గురించి ఆయన చెప్పారు మేము తరువాత ఇస్తామని చెప్పాను కాని ప్రస్తుతం ఇస్తామని చెప్పడంలేదని మనవి చేస్తున్నాను.

(NO ANSWER)

SRI P. GUNNAYYA :—Regulator ఏర్పాటుకు అవసరమైన estimates పూర్తి అయినవా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Estimates లోపం లేదు. 50 కోట్లు కావలసిన estimates తయారుగా ఉన్నాయి. కావలసింది డబ్బు.

SRI L. LAKSHMANA DAS :—అప్పారావుగారు నందివాడకు నాకుసంబంధం లేదన్నారు. General గా చిన్న స్కీములు తీసుకున్నపుడు నేనుచెప్పిన విషయాల ప్రభుత్వం ఆలోచిస్తుందా అని అడుగుతున్నాను.

(NO ANSWER).

SRI P. SATYANARAYANA :—ఎక్కువ percentage returns వచ్చే చిన్న స్కీముల విషయంలో రెండవ పంచవర్ష ప్రణాళిక పరిమితులను బయట ప్రభుత్వం Reserve Bank నుంచి డబ్బు తీసుకువచ్చి అమలుచేయడానికి అవకాశం ఉంటుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Reserve Bankనుంచి డబ్బు తీసుకునే విషయమై ప్రశ్న Chief Minister గారిని వేస్తే బాగుంటుంది.

*Employment of superannuated medical officers as honorary surgeons.*

486—

*667 Q.—SRI P. NARASIMHAPPA RAO : Will the Hon the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government have received any applications from the superanuated medical officers for being employed as Honoray Surgeons; and

(b) if so, whether the Government propose to employ them for making up the shortage of qualified medical officers ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The answer is in the negative ;

(b) Does not arise.

SRI. P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, మా ప్రాంతములో కొన్ని Headquarters hospitals కొన్ని మామూలు ఆస్పత్రులు వున్నాయి. వాటిల్లో ఆడ డాక్టర్లు మగ డాక్టర్లుగా పని చేస్తున్నారు. ఈ విధంగా ఎందుకు చేయవలసి వచ్చిందని అధికార్లను అడిగితే కావలసినంతమంది డాక్టర్లు లేరని అంటున్నారు. ఒక పనిచేయ బోయి యింకొక పనిచేసే టటువంటి కుర్రవాళ్లను కొత్తగా డాక్టర్లనుగా వేస్తున్నారు. చాలా కాలము అనుభవమువున్న డాక్టర్లు ఉన్నప్పటికిని, యీ కుర్రవాళ్లను ఎందుకు నియమిస్తున్నారు ? అనుభవమువున్న డాక్టర్లను యీ ఆస్పిటల్సులో గవర్నమెంటువారు తీసుకుంటారా అని అడుగుతున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—శ్రీ నరసింహప్పారావుగారు యీ ప్రశ్న వేసినప్పుడు వారికి యీ భావమువుంటే బాగుండేది. వారు వేసిన ప్రశ్నలో "Whether the Government have received any application" అని వున్నది. "ఎవరిదగ్గరనుంచి అయినా దరఖాస్తులు వచ్చినవా" అని, దానికి తెలుగులో అర్థము. ఎవరిదగ్గరనుంచిన్ని ధంఖాస్తులు రాలేదని నేను సమాధానము చెప్పాను. వాళ్లను డాక్టర్లుగా నియమిస్తారా, లేదా, అనేది రెండవ విషయము.

Sri. P. NARASIMHAPPA RAO:—నేను ఆ ప్రశ్న గూడా వేశానండి.

The Hon Sri K. VENKATA RAO:—ఆ విషయము యీ ప్రశ్నలో లేదండి.

SRI P. SUNDARAYYA:—కేంద్ర ప్రభుత్వోద్యోగములలో నున్న డాక్టర్లు అరవైఏండ్లవరకు సర్వీసులో నుండవచ్చునని యీ మధ్య నిర్ణయము చేశారు. మీరుకూడా అటువంటి నిర్ణయానికి వస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—అలాంటి differential treatment ఉంటే, కోర్టులో writ వేస్తారు. అందుచేత భయపడుతున్నాను.

## II. ADJOURNMENT MOTION.

Re-floods and submersion of several villages in Palakonda and Srikakulam Taluks.

MR. SPEAKER :—Sri P. N. Apparao has given notice of the following adjournment motion :—

"This House stands adjourned to discuss the situation arising out of floods and submersion of several villages like Gopalapuram, Ampili, Annavaram, Kothavalasa, Venkatapuram, Yerakarayapuram, Agraharam, Ramachandrapuram, Boddavalasa and Kodali in Palakonda and Srikakulam Taluks under Nagavali river by the negligence of the Revenue and the Government Officers in not providing alternative house sites, construction of flood-banks, and constitution of Flood Control Board for Nagavali river and other relief measures of temporary and permanent nature."

గవర్నమెంటు ఉద్యోగులు Flood banks మొదలైనవి కట్టగల తాహతు కలవారు కారు. గవర్నమెంటు కట్టించవలె. అందుచేత ఈ విరామతీర్మానాన్ని నేను Rule out చేస్తున్నాను.

Sri K. V. S. PADMANABHARAJU :—Inams bill ను ప్రెసిడెంటుగారి ఆమోదానికి పంపామని చెప్పారు. వారి ఆమోదమువచ్చిందా ? వచ్చివుంటే, ఆ బిల్లును యీ మీటింగులో ప్రవేశ పెట్టుతారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—బిల్లులోని కొన్ని విషయములపై సూచనలతో ప్రెసిడెంటుగారి వద్దనుంచి మనకు తిరిగివచ్చింది. ఒక బిల్లును శాసనసభలో చర్చించాలంటే, దానికి యింత కాలము ముందుగా నోటీసు యివ్వాలి, అనేటటువంటి నియామాలు లేకపోయినట్లైయితే, ఆ బిల్లును వెంటనే ప్రవేశ పెట్టటానికి ప్రభుత్వానికి ఎటువంటి అభ్యంతరమూ వుండదు. Speaker గారితో యీ విషయాలుఅన్నీ ఆలోచిస్తాము.

## III. SUPPLEMENTARY ESTIMATES OF EXPENDITURE FOR 1955-56.

### (General Discussion).

MR. SPEAKER :—Now we shall take up the discussion on the Supplementary Demands. The voting on the Demands will take place on the 3rd October. Shall we now take up one of the several Demands for discussion?

SRI P. SUNDARAYYA :—మాపార్టీకి సంబంధించినంతవరకూ డిమాండ్లపై వేరువేరుగా చర్చించటానికి మాకు ఎటువంటి అభ్యంతరమూలేదు. కాని Constitution ప్రకారము general discussion కు గాను గవర్నరు గారు గంటో, గంటన్నరో కాలమునిర్ణయించివుంటారు. ఆ నియామకాన్ని మనము పాటించవలసి వుంటుంది. అయితే, speaker గారు చేయదలచుకున్నదాన్ని మేము అంగీకరిస్తాము.

MR. SPEAKER :—By discussing in general, let us confine ourselves to the Demands.

THE HON. SRI B. GOPALA REDDI :—అక్టోబరు 3 వతేదిన డిమాండ్లపై వేరువేరుగా చర్చజరిపి ఓటుతీసుకోవలసి వున్నది. ఈరోజున general discussion మాత్రమే జరగాలి. బడ్జటుపైన general discussion ఏవిధంగా జరుపవలెనో అదేవిధంగా సప్లిమెంటరీ డిమాండ్లపైనగూడా general discussion జరుపవలెను అనేటటువంటి తతంగమంతయు Constitution ప్రకారము నిర్ణయించబడియున్నది. కాబట్టి యీరోజున general discussion జరిపి, మూడవతేదిన డిమాండ్లకు cut motions ప్రతిపాదించడము, చర్చించడము జరపవచ్చును. ఈరోజున general discussion మాత్రమే సాగిద్దాము. ఏవైనా విమర్శలువుంటే, చేయవచ్చును. విమర్శలు లేకపోతే, ఎజండాలోని తరువాత అంశమునకు పోవచ్చును.

SRI R. B. RAMAKRISHNA RAJU :—ఫజులాలి కమిషన్ రిపోర్టు ప్రచురణ అవుతుందని పత్రికలలోవచ్చింది. Chief minister గారికి యీ విషయమై ఏదైనా సమాచారము అందిందా? అందితే, దాన్ని గురించి తెలియజేస్తారా?

THE HON. SRI B. GOPALA REDDI —అందలేదు. ఆవిషయమై 3 వ తేదినాడు చూచుకోవచ్చు. ఈరోజు గవర్నరుగారు సప్లిమెంటరీడిమాండ్లపై సాధారణ చర్చకొరకు నిర్ణయించారు కాబట్టి, ఆవిషయమై చర్చించకోవడము మంచిది.

MR. SPEAKER :—సప్లిమెంటరీ డిమాండ్లపై చర్చ సాగించే సందర్భములో బడ్జటుడిమాండ్లపైన చేసే general discussion మాదిరికాకుండా—నిన్న నేను పార్టీనాయకులతో చెప్పినట్లు—డిమాండ్సులో ఏఏవిషయాలు ప్రభుత్వమువారు ఉదహరించారో వాటికి సంబంధించినంతవరకే చర్చను పరిమితముచేయాలని సభ్యులను కోరుతున్నాను. ఉపన్యాసాలు దీర్ఘంగాలేకుండా, ఒక్కొక్కరు అయిదునిమిషాలు తీసుకుంటే మంచిదని నా అభిప్రాయము.

Sri PILLALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా, పది నిమిషములైనా యివ్వమని కోరుతున్నాను. మొదట పంచవర్ష ప్రణాళిక కాలములో ఏర్పాటుచేయవలసిన ప్రాథమిక పాఠశాలలు అన్నీ యింతవరకూ ఏర్పాటు చేయనందువల్ల వాటిని 31-3-1956 లోగా ఏర్పాటుచేయవలెననే నిర్ణయానికి ప్రభుత్వము వచ్చినందులకు అభినందించవలసివున్నది. ఈవిధంగా 840 పాఠశాలలు ప్రభుత్వమువారు కొత్తగా ప్రారంభిస్తారు. వీటినిమిత్తం 630 వేల రూపాయల చిల్లర ఖర్చు అవుతుంది. దీనివిషయములో వున్నటువంటి చిక్కు సమస్యను ప్రభుత్వ దృష్టికితీసుకొని రావలసిన అవసరమున్నది. ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటుచేసే విషయమై కుప్పుస్వామి కమిటీవారు కొన్ని సూచనలు చేశారు. వాటిలో కొన్నిటిని ప్రభుత్వం ఆమోదించారుకూడా. అయితే కుప్పుస్వామి కమిటీవారుచేసిన సూచనల ప్రకారము యీ పాఠశాలలను ప్రభుత్వమే నిర్వహించ దలచలేదు. "Per annum లో full subsidy basis" అనేపద్ధతిపై యీ పాఠశాలలను ఏర్పాటుచేయడమువల్ల మనము ఆశించినంత ఫలితము రాకపోవచ్చును. ప్రభుత్వమే యీ పాఠశాలలను నిర్వహించడము మంచిదని నా అభిప్రాయము. ఇందువల్ల అయ్యే ఖర్చుకూడ యేమంత ఎక్కువలేదు. పైగా యీ పాఠశాలల ఏర్పాటు కయ్యే ఖర్చులో నూటికి డెబ్బైయైదువంతులు కేంద్రప్రభుత్వమే భరిస్తుంది. అయితే యీ పాఠశాలలను subsidy basis మీద ఎందువల్ల ఏర్పాటుచేయాలో నాకు అర్థముకావడములేదు. ఒకవేళ ప్రభుత్వమే వాటిని నిర్వహించినా, అయ్యే అదనపుఖర్చు 30 వేలకు మించదు. అందువల్ల subsidy basis మీద వాటిని నడపడము మంచిదికాదని నాయభిప్రాయము. Subsidy basis మీద నడుపబడుతున్న పాఠశాలలు యేవిధంగావున్నదో మనకు తెలుసు. వాటినిగురించి కుప్పుస్వామికమిటీ రిపోర్టులోగూడ వ్రాశారు. Subsidy యిస్తున్న పాఠశాలలు కేవలము ప్రభుత్వముయొక్క డబ్బుతో నిర్వహింపబడుతున్నాయేకాని, అదనంగా ప్రజలవద్దనుండిగాని, మరెక్కడనుండిగాని, వాటికి డబ్బు వసూలుకావడము లేదు. అందువల్ల వాటిని ప్రభుత్వమే నిర్వహించడము మంచిదని నా అభిప్రాయము.

ఉస్మానియా కళాశాలకు కొత్తభవనాలు నిర్మించేందుకుగాను ఒకలక్షరూపాయలు ప్రభుత్వము యిస్తున్నట్లుగా చూపబడింది. ఇవి చాలా ముఖ్యమైనవిషయము. అయితే యిప్పుడు ఉన్న పరిస్థితులనుగురించి మంత్రిగారు చెప్పియుంటే బాగుండేది. కాలేజీలో యిప్పుడు ఎంతమంది విద్యార్థులున్నారు, ఎంతమంది అదనంగా చేరబోతున్నారు, ఇప్పుడు ఏఏగ్రూపులున్నాయి, ఇకముందు లేటిని ఏర్పాటుచేయబోతున్నారు, ఏఏ సౌకర్యాలు కలుగజేయబోతున్నారు, మొదలైన విషయాలనుగురించి మంత్రిగారు వారి సమాధానములోనైనా చెప్పవలెనని కోరుతున్నాను.

తరువాత King Institute of Guindy మనకు ఉపయోగం లేకుండా పోతోందని చెప్పారు. అట్లాంటప్పుడు మనంకూడా అటువంటిది ఏర్పాటు చెయ్యడానికి త్వరలో పూనుకోవలసి నటువంటి అవసరంఉన్నదని అట్లాంటిదికూడా ఏర్పాటు చెయ్యాలని దీంట్లో వ్రాస్తూ on regional basis అని విశాఖపట్టణం mention చేశారు. అదిమాత్రం కొంచం ఆశ్చర్యంగా నేవుంది. ఒకదాన్ని complete గా perfect గా develop చేసి, చిన్న చిన్నవి అవసరమైతే Head-quarters hospital లో చూడవచ్చును. Kurnool లో hospital కి 2½ ఎకరాలు కొనబోతున్నారనీ ఈ Hospital అభివృద్ధి చేసేటప్పుడు ఇక్కడ medical college పెట్టుకు నేందుకువీలుగా అభివృద్ధి చేస్తారనికూడా ఆశిస్తున్నాం. ఆవిధంగా చెయ్యాలనికూడా కోరుతున్నాం. Agency tracts లో First Five Year Plan క్రిందనే కొన్ని schemes sanction ఐనాయి. ఆ Five Years Plan క్రింద sanction ఐనటువంటి schemes ని ఇంతవరకూకూడా అమలు జరపలేదు. ఈ సంవత్సరం అమలు జరపడానికి మనప్రభుత్వం పూనుకున్నది. పూనుకున్నప్పుడు సాధారణంగా కేంద్రప్రభుత్వమే దీనికి డబ్బియ్యాలి. వాళ్లు పెట్టిన సేవింగు 15 లక్షలు పూర్తిఐనదని, మన్నే ఈడబ్బు భరించమని కోరడంమాత్రం ఏ విధంగానూ సమంజసంగాలేదు. ఆపని మనం మొదటి పంచవర్ష ప్రణాళికలో పూర్తిచేసుకోలేక పోయినాం. నిజానికి యిప్పుడు ఆడబ్బు దీనికోసం ఖర్చుపెట్టవలసిన అవసరం ఉంది. అది అల్లా ఖర్చుపెట్టడానికి వీలులేకపోయింది కనుక డబ్బులేక అవస్థ పడుతూ యున్నటువంటి ఈ ప్రభుత్వమే దాన్ని భరించాలనేటటువంటి వాదంతో మాత్రం అంగీకరించలేకుండా యున్నాం. మళ్ళీ కేంద్రప్రభుత్వానికి తెలియజేసి, ఈడబ్బు కేంద్రప్రభుత్వం దగ్గరనుంచే రాబట్టడానికి ప్రభుత్వం పూనుకుంటుందని కూడా ఆశిసున్నాం. తరువాత మాచర్లరోడ్డుకూడా వెయ్యాలంటున్నారు. ఐతే ఈ విషయంలో ప్రభుత్వం తగుశ్రద్ధ తీసుకోలేదనే చెప్పవలసినటువంటి అవసరం వున్నది. గవర్నరుగారు వెళ్లినప్పుడు ఆయన వచ్చారుగదా అని, దానిమీద యింత ఇసుక, సున్నం అంతాపోసి చాలా perfect గా చక్కటిరోడ్డుగా తయారుచేశారు. ఇప్పుడుచూస్తే ఆరోడ్డంతా గోతులుపడి నిరుపయోగంగాఉంది. దానిమీద మళ్ళీ యింత తారు కొట్టబోతున్నారు. ఈ విధంగా ఎక్కువడబ్బు ఖర్చుపెట్టి హడావిడిగాచేసి contractor లకు డబ్బు పొయ్యడమేకాని, రోడ్డు సరిగాలేకుండా పోయింది. ఈనాడు కర్నూలులోకూడా వేస్తున్నరోడ్లు మనం చూస్తూనే యున్నాం. క్రొత్తగా State ఏర్పడింది గదా అని హడావిడిగా విపరీతమైనడబ్బు ఖర్చుపెట్టి రోడ్లువేశారు. ఈరోజునచూస్తే ఆ tar road లు మామూలు రోడ్లకంటెకూడా అధ్వాన్నమైన పరిస్థితులలో ఉన్నాయి. ఈ అనుభవాన్ని బినా దృష్టిలో పెట్టుకుని మాచర్లరోడ్డు మళ్ళీ వేయదలచుకున్నప్పుడు జాగ్రతగా వేయా

ల్సిందేకాని ఏదోవిధంగా హడావిడిగా ఒక tar road ఒకరాత్రిలో సృష్టించాలని వేస్తే ఆ road వెంటనే పోతుంది. ఈ హడావిడి పనులు కట్టిపెట్టి తాపీగా వేయించి ఏ పదిసంవత్సరాలో, 15 సంవత్సరాలవరకూ ఆ road ఉపయోగపడేటటువంటి విధంగా తయారు చెయ్యాలిగాని డబ్బుదుబారాగా ఖర్చుపెట్టడం పనికిరాదనే విషయాన్ని మంత్రివర్గదృష్టికి తీసుకువసున్నాను. T. M. T. workshop బెజవాడలో ఒకటి పెడతామన్నారు. దీని అవసరం ఎంతయినా ఉన్నదని చెప్పాలి. మన ఆంధ్రరాష్ట్రంలో ఈనాడు చూస్తే ప్రభుత్వంయొక్క లారీలుకాని, road roller లు గాని, cement mixers గాని, తారుకలిపించేటటువంటి మిషన్లు గాని ఎంత చిన్న చిన్న repair లు వచ్చినా బాగుచేసే దిక్కులేక దండగగా అనేకచోట్ల రోడ్డుమీద పడి ఉంటున్నాయి. Contractor లు ప్రభుత్వలారీలు తీసుకోరు. ఏదో చెడిపోయిందని నిరుపయోగంగా అక్కడ పడేస్తారు. వాటిని బాగుచేసి సరిచేసేటటువంటి సాధుడుకూడా ఈరోజున లేకుండా ఉన్నాడు. P.W. Department ఎంత చక్కగా పనిచేస్తోందో మనకందరకూ కూడా తెలుసును. దానంత దండగ department మరొకటిలేదు. దాని అవసరం ఎంత ఉన్నప్పటికీ, ఈరోజున అది పనిచేసేటటువంటి పద్ధతి చూచేటట్లయితే ప్రజల డబ్బు దుర్వినియోగం చెయ్యడానికి ఉపయోగపడుతున్నదేకాని, ప్రజల ద్రవ్యం సక్రమంగా ఖర్చుపెట్టడానికి ఉపయోగపడడంలేదు. Workshops విషయంలో బెజవాడలో Krishna Barrage కి కావలసిన పనిముట్లు తయారుచేసేటటువంటి పెద్ద workshop ని పెట్టడమే కాకుండా ప్రతి District Headquarters లోనూ ఒక చిన్న workshop లాంటిది పెట్టి ఈ road rollers, లారీలకు చిన్న చిన్న repairs చేయించి, వెంటనే అవి పనికి ఉపయోగపడేటట్లు చూడాలి. ఇప్పుడు రోడ్లమీద ఎక్కడ చూచినా ప్రతిమైలుకూ ఒకలారీగానీ, ఒక road roller గాని పనిచేయనివి వదలిపెట్టబడి కనబడుతోంటాయి. దీన్ని అరికట్టి అవి repair చేయించే చిన్న workshops నెలకొల్పడానికి ప్రభుత్వం తగుచర్య తీసుకోవాలని వారి దృష్టికి తీసుకువస్తున్నాను. కడప జిల్లాలో రోడ్లకోసమని 3 లక్షల 42 వేల రూపాయిల వరకూ sanction చేస్తున్నారు. అక్కడ seasonal conditions బాగులేక agricultural labourers కి పనిలేకపోవడంవల్ల, పని కల్పించడానికి ఈ road sanction చేస్తున్నామని చెప్పారు. నేనొక ప్రశ్న అడగవలసియున్నది. ఈనాడు seasonal conditions ఈ మాదిరిగా వస్తాయని అప్పుడే sanction చేసినారా లేక agricultural labourers కి relief ఇవ్వడానికి road works sanction చేసి ఆ డబ్బు ఇంతవరకూ రాలేదు కనుక మళ్ళీ ఇప్పుడు sanction చేస్తున్నారా? ఈవిషయం ఇందులో తెలియచేయలేదు. ఇంత డబ్బు sanction చేసినప్పటికీకూడా agricultural

labourers కి relief వచ్చిందని అనుకోడానికి మాత్రం అవకాశం లేదు. బహుశ contractor లకు దీంట్లో ఎక్కువ భాగం పోయి, వాళ్ళకు relief వచ్చిందేమో గాని agricultural labourers కు మాత్రం ఏమీ relief రాలేదు. అనేకమంది contractor లు పనులు చేయించుకుని డబ్బు ఎగగొడుతోన్నటువంటి ఘటనలు అనేకం ఉన్నాయి. వాళ్ళకు కొంచం నష్టంవచ్చిందా అంటే labour కు ఒక్క దమ్మిడీకూడా ముట్టచెప్పకుండా పరారీ ఐపోతున్నారు. ఈనాడు ప్రభుత్వం పేద ప్రజానీకానికి ఎక్కువ ఉపయోగపడే లాగున ఉండాలని చెబుతూ contractor లు కనీసం కూలీ ఐనా వాళ్ళకు ఇస్తున్నారాలేదా, ప్రభుత్వం నిర్ణయంచినటువంటికూలీ వాళ్ళకు ముట్టుతున్నవాలేదా అనే విషయాన్నికూడా ప్రభుత్వం విచారించకుండా ఉండడం న్యాయంకాదు. మన Department లు ఈ విషయాలను గురించి పట్టించుకోవు. మన departmental ల వారు ఎంతసేపూ బ్రిటిషు సామ్రాజ్య వాదులు దేశాన్ని ఏ పద్ధతులలో నడిపారో, ఆ పాత పద్ధతులలోనే దేశాన్ని నడపడానికి శక్తి సామర్థ్యాలున్నటువంటి departmental హెడ్స్ మనకున్నారే గాని, ఈనాటి మన గవర్నమెంటువారు చెప్పేవిధానాలు ప్రతి భింబించే విధంగా నడుస్తున్నారా అంటేలేదు. మన Budget లో గాని, supplementary demands లోగాని అటువంటిదేమీ అగపడడంలేదు. ఈ పద్ధతి సరిచెయ్యాలని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. మనం supplementary demands discuss చేసేటప్పుడు మంత్రులంతాకూడా ఉండాలనే నాకోరిక. ఎందువల్ల నంటే ఇది general debate కాదు. నేను Electricity ని గురించి చెప్పే టప్పుడు ఆ మంత్రి గారు లేకపోవడం బాగాలేదు.

THE HON. Sri K. VENKATA RAO :—ఆయన తరపున 5 రోజుల నుంచి నేను పని చేస్తున్నానండి. ఈవేళ హఠాత్తుగా వెంకటేశ్వర్లుగారికి ఎందుకు జ్ఞాపకంవచ్చిందో తెలియడంలేదు.

Sri P. SUNDARAYYA :—వారికి బదులు 5 రోజులుగా వీరు పనిచేయ వచ్చు. ఇంకో మంత్రి చేయవచ్చును, కాని శాసన సభ పిలచినప్పుడు, ఇన్ని రోజులు tour కార్యక్రమం వేసుకోవడం న్యాయంకాదని మాత్రం మంత్రివర్గం గుర్తించి ఇకముందు ఇటువంటివి జరగకుండా చూస్తే మంచిదని కోరుతున్నాను.

THE HON SRI K. VENKATA RAO :—ఆయన వెళ్ళడానికి కారణం కొన్ని అనుకోనివి ఏవో మన నెత్తిమీదికి వస్తాయని. రేపు ప్రొద్దున ప్రెసిడెంటుగారు వస్తారు. ఎల్లుండి Bulganin గారు వస్తారంటే ఇక్కడే కూర్చోమంటే ఎల్లాగ? ఏవో పెద్ద వాళ్ళని మర్యాద చెయ్యడానికి వెళ్ళాలిగదా. ఇది ఎప్పుడో ఒకసారి జరుగుతుందికాని అస్తమానం వెళ్ళాలనే సంకల్పంలేదు.

(At this stage Mr. Deputy speaker occupied the chair)

MR. DEPUTY SPEAKER :—సాధ్యమైనంతవరకూ మంత్రులే కాకుండా శాసన సభ్యులు యావన్మందికూడా ఉంటే బాగుంటుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఉండాలి నిజం. దాని విషయమై మీరు ruling ఇస్తే తప్పకుండా ఉండాలనే మాయొక్క కోరిక కూడా. అల్లా ruling ఇస్తే సంతోషిస్తాం. ఈమంత్రే కాదు. మంత్రులందరూ లేకపోయినా కళా వెంకట్రావుగారు ఒక్కరే మంత్రి వర్గానంతా నడపగల శక్తి సామర్థ్యాలు కలవారు అని మేము గుర్తిస్తాం.

Mr. DEPUTY SPEAKER :—ఆ మంత్రే ఉండాలని ఏమీలేదు. ఏ మంత్రులైనా ఉండవచ్చును.

SRI PILLALAMARRI VENKATESWARLU :—నేను Electricity Demand మీద ముఖ్యమైన విషయాలు చెప్పబోతున్నాను. వారు లేకపోవడం వల్ల నాకు చిక్కువచ్చింది. వారుంటే వెంటనే సమాధానం చెప్పేవారు. ఈ electricity విషయంలో తిరుపూరువరకూ extend చేయడం చాలా సంతోషించ తగ్గ విషయమే. ఇదివరకు సంజీవరెడ్డిగారు electricity మంత్రిగా ఉండగా కూడా చాలా తడవలు విజ్ఞప్తిచేస్తూ వచ్చాను. ఈ extension మునగాల పరగణాకుకూడా చెయ్యాలని ఎక్కడో మూలగా దేవుడిచేత, ప్రభుత్వంచేతా కూడా neglect చేయ బడ్డటువంటి మునగాల పరగణాకు తప్పకుండా extend చెయ్యాలని ఎన్నిసార్లో మనవిచేశాను. అనేక petition లు పెట్టాం. Supplementary demands లో కూడా దాని ఊసు ఎత్తకపోవడం చాలా శోచనీయం. చల్లపల్లి Estate కే Electricity తీసుకుపోయి నటువంటి పెద్దమనుష్యులు కనీసం ఇదైనా చేయకపోవడం చాలా బాధాకరమైన విషయం. రెండులక్షల రూపాయిలు వ్యయంచేస్తే ఒక డీసెలు ఇంజను ఏర్పాటుచేసి పరగణాకంతా supply చేయ వచ్చును. ఈ extension of times లో చిన్న పొరపాటు జరుగుతోంది. జగ్గయ్యపేట దాకా line పోతుంది. ప్రక్కనున్న గ్రామానికి line వెయ్యకుండా ఉండిపోతుంది. ఇది ఎందుచేతనో తెలియడం లేదు. ఖచ్చితంగా ఇన్నిమైళ్ళ దూరంలో మొట్టమొదట ప్రయారిటీ ఇవ్వాలని నిబంధన ఏర్పాటుచేయ్యాలి. జగ్గయ్యపేటనుంచి చుట్టుప్రక్కల గ్రామాలన్నీ వదలిపెట్టి ముక్యాలలో జనం లేనటువంటి చోటికి ఏడుమైళ్ళదూరం ఇస్తున్నారు. ఇది కాకుండా చుట్టుప్రక్కల గ్రామాల మీదుగా పోయేటప్పుడు వాటికికూడా ఇవ్వాలని ఒక procedure ఏర్పాటు చెయ్యాలని కోరుతున్నాను.

SRI P. RAJAGOPAL NAIDU :—ఈ వేళ విషయానికి సంబంధించి ప్రస్తుత single teacher school ఎక్కువగా స్థాపించినందులకు ప్రభుత్వాన్ని

అభినందిస్తున్నాను. దీనితోపాటుగా free school education కూడ ఏర్పాటుచేస్తే చాలామంచిది. Free school education kindergarten and creche.

MR. DEPUTY SPEAKER:—అవి ఇందులో లేవండి. ఇందులో వుండే విషయాలను గురించి మాత్రమే చర్చ చేయండి. లేని ఊహ చేసి ఇపుడు ఏమి ప్రయోజనం.

SRI P. RAJAGOPAL NAIDU:—అయినప్పటికి అదే మాట్లాడుతూ ఉన్నానండి. Suggestion ఎందుకంటే supplemental grant లో ఇవి రాలేదు. కనుక అవి తప్పనిసరిగా ఇపుడు తీసుకొని రావలెనని కోరుతూ ఉన్నాను. ఇకమీదట అయినా చిత్తూరులో కాలేజిగాని Polytechnic గాని లేదు. అందువల్ల త్వరలోనే, ఈ supplemental grant లో కాకపోయినా, చిత్తూరులో Polytechnic పెట్టవలెనని నేను కోరుతున్నాను. Electricity కి సంబంధించి మా నియోజకవర్గములో ఆరగొండ స్కీముకు sanction చేశారు. దానికి ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. దానితో పాటుగా చిత్తూరులో ఉన్న Corporation ను వెనువెంటనే ప్రభుత్వం తీసుకొనకపోతే చుట్టుప్రక్కలవుండే గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి సాధ్యంకాదు. చిత్తూరులోవుండే Corporation ను వెంటనే ప్రభుత్వం తీసుకొనవలెనని నేను కోరుతున్నారు. ఎందువల్ల అంటే 7, 8 ఏండ్లకు చుట్టుప్రక్కలవున్న గ్రామాలవారు electricity కావలెనని కోరుతూ ఉన్నప్పటికి కార్పొరేషన్ ఉండడంవల్ల, అయిదుమైళ్ళకులోగా connection ఇవ్వకపోవడంవల్ల దూరప్రాంతాలలో ఉన్నవారికి 6,7 మైళ్ళలో ఉన్నవారికి ఇక్కడ అవుతున్న ఖర్చును అంతా భరించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి వెంటనే ఈ Corporation ను ప్రభుత్వం తీసుకొనవలెనని కోరుతున్నాను. అంతేగాక Corporation limits లో అయినా సరే వెనువెంటనే ఆ గ్రామాలకు విద్యుచ్ఛక్తి ఇవ్వవలెననికూడ నేను కోరుతున్నాను. ఈ సాంఘిక సంక్షేమ విషయంలో చాలామంది ఏనాదులు అక్కడక్కడవున్నారు. మా నియోజకవర్గములోకూడ ఆలాగు చాలా నియోజకవర్గాలలో ఉన్నారు. ఎక్కడెక్కడ ఉన్నారో ప్రభుత్వం అక్కడల్లాకూడ సాధ్యమైనంతవరకు వాండ్లకు సౌకర్యాలు కల్పించడానికి ప్రయత్నించమని నేను కోరుతున్నాను. దీనితోపాటు ఈ రోడ్ల విషయంలో చిత్తూరుజిల్లాలో famine works క్రింద చేసినరోడ్లు చాలావున్నాయి. వాటికి ఏదో కొత్త గ్రాంటులు యిచ్చారు. మంచిరోడ్లుకూడ famine రోడ్లకంటే చాలదుస్థితిలో ఉన్నాయి. ముఖ్యంగా మా అరగొండరోడ్డు ఏమి ప్రయోజనం లేకపోయింది. అది సుమారు నూరుఏండ్లక్రితం వేసిన రోడ్డులాగా అయిపోయింది. జిల్లాబోర్డుకు funds లేకుండా పోవడంవల్లను, వాటిని సరిచేయడానికి చాలా కష్టంగావుంది.

అక్కడ దినానికి సుమారు 52 Single, trips బస్సులు లారీలు తిరుగుతూ ఉంటాయి. 12 మైళ్ళ రోడ్డు కాని రిపేరు చేయడానికి జిల్లాబోర్డుకు వీలు లేకుండా పోతుంది. అందువల్ల జిల్లాబోర్డులకు ఈ రోడ్స్ రిపేరుచేయడానికి ఇపుడు కొన్ని గ్రాంటు ఎక్కువ చేయవలెనని కోరుతున్నాను. ఇరిగేషన్ విషయంలో చిత్తూరుజిల్లాలో పడమటి ప్రాంతంలో ఈ మైనరు ఇరిగేషన్ స్కీములు ఏమితీసుకోన లేదు. చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకాలో గాని, పలమనేరు తాలూకాలో గాని ఈ తాలూకాలలో minor irrigation కు సంబందించి ఏమాత్రం సక్రమంగా పని జరగడంలేదు. అందువల్ల ఈ minor irrigation కు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వవలెను. చిత్తూరుజిల్లాలో ముఖ్యంగా ఎందువల్ల అంటే ప్రాజెక్టులు కట్టుటకు వీలులేదు. పశ్చిమ ప్రాంతంలో అందుచేత ఈ పాలారు బేసిను రూల్సు అడ్డువస్తున్నాయని చెప్పి, ఏ project కూడ కట్టకుండా ఉంటున్నారు. వెనువెంటనే అసలు ఈ palar basin rules రద్దుచేసి అక్కడ కొత్తస్కీములు కట్టేటట్లు ఏర్పాటు చేయవలెను. నా నియోజక వర్గములోనే 13 కొత్త చెరువులు కట్టడానికి వీలుఉన్నది. కాని ఈ palar basin rules అడ్డం వస్తుందన్న కారణముచేత ఇంతవరకు దానిని ఏర్పాటుచేయడానికి వీలులేకుండా ఉన్నది అంతేకాక చిన్న చిన్న చెరువులను అభివృద్ధిచేయడానికి వీలుఉంది. ఈదినము ఎస్టేటులలో 15, 20 ఎకరాలు ఈ లెక్కలలో నమోదు అయినవి. ఉన్నప్పటికి, 50, 100 200 ఎకరాలు క్రొత్త ఆయకట్టు, ఆ చెరువుక్రింద చేర్చేదానికి వీలువుంది. కాని ఈ palar basin rules అడ్డువస్తున్నందున వాటి ఆయకట్టు పెంచడానికి వీలు లేకుండా, ఈ irrigation సౌకర్యాలు హెచ్చుచేయడానికి వీలులేకుండాఉన్నది. కాబట్టి ఈ palar basin rules ను రద్దుచేసి వెంటనే irrigation సదుపాయాలు కలిగించవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

SRI K. PUNNAYYA:—అధ్యక్షా, నేను ఈ supplementary బడ్జెటును బలపరుస్తూ హరిజన welfare కు సంబంధించి రెండువిషయాలు ప్రభుత్వ దృష్టిలోకి తీసుకొని రాదలచాను. ఇటీవల ప్రభుత్వమే క్రొత్తగా 17 hostelsకు డబ్బును మంజూరు చేయడంలో నేను నిజంగా సంతోషపడుతున్నాను. ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను కూడ. ఇదివరకు శ్రీకాకుళం జిల్లాలో ఏ రెండుమూడు తాలూకాలలో తప్ప, మిగిలిన తాలూకాలలో hostels లేకుండా ఉండేవి. ఇప్పుడు ఆ జిల్లాలో క్రొత్తగా ఏడు hostels ను, హరిజనాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని స్థాపించడం అనేది జిల్లాఅంతకు సంతోషదాయకమైన విషయము. ఇదేసమయమున కొన్ని చోట్ల బోర్డింగు గ్రాంట్సు కొద్దికొద్దిగా తగ్గించడం విచారకరమైన విషయం. ఇవిఈ విషయమై మరల ఆలోచించి గ్రాంట్సు తగ్గించకుండా చేయవలెనని ప్రభుత్వాన్ని

కోరుతున్నాను. చీపురుపల్లి తాలూకాలో లుట్టపేట అనే గ్రామంలో హరిజన wellfare school ఉన్నది. అందులో Mid-day meals గత సంవత్సరం నుండికూడా విద్యార్థులకు ఏర్పాటు కావడంలేదు. ఈ విషయమై ప్రభుత్వం ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొని, Mid-day meals ఏర్పాటు చేయవలెననియు యీ జిల్లాలోని మిగిలిన వెల్ఫేర్ స్కూళ్ళలోకూడ Mid-day meals విధానాన్ని అమలు పెట్టవలెనని కోరుతున్నాను. ఇప్పుడిప్పుడు శ్రీకాకుళంజిల్లాలో హరిజనులలో చైతన్యం పెరుగుతూ యున్నది. చదువుకునేందుకు కుతూహలపడుతున్నారు. చాలమంది విద్యార్థులు schedule tribes, castes, backward classes నుంచి కూడ ముందుకు వస్తున్నారు. Scholarships విషయమై దరఖాస్తులు పెట్టుకొని యున్నారు. ఈజిల్లా విద్యాభివృద్ధిని ప్రత్యేకదృష్టిలో పెట్టుకొని యీ తరగతులకు చెందిన విద్యార్థులకు సర్వవిధముల ప్రభుత్వం సహాయపడవలెనని కోరుచున్నాను. కావున non-residential scholarships ను ఎక్కువగా మంజూరుచేసే విషయమై ప్రభుత్వం ఆలోచించవలెనని కోరుచున్నాను. Waltair లో ఉన్న University లో backward classes, schedule tribes & castes చాలమంది చదువుతూ యున్నారు. వారు residential scholarships విషయమై దరఖాస్తులు పెట్టుకొని యున్నారు. ముఖ్యముగా హరివిషయమై ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ తీసుకొనవలయునని కోరుచున్నాను. బంజరుభూముల సందర్భంలో శ్రీకాకుళము జిల్లాహరిజనులు అనేకచిక్కులకు లోనగుచున్నారు. పెద్దభూస్వాములు landholders బంజరుభూములను ఆక్రమించుకొని యున్నారు. ప్రభుత్వాధికారులకు ఎన్ని దరఖాస్తులు పెట్టుకొన్నా హరిజనులకు ఏమాత్రం ఈ సందర్భంలో సహాయం చేయకుండా వున్నారు. G.O. లో కూడ, landless poor కే బంజరు భూములు యివ్వాలి అని వున్నది. కాబట్టి యీ విషయమును ప్రత్యేకదృష్టిలో పెట్టుకొని ఎక్కువ భూములు వున్న భూస్వాముల ఆక్రమణనుండి వీటిని తొలగించి landless poor కు అవి ఇప్పించాలని కోరుతూ సెలవు తీసుకొంటున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఆంధ్రరాష్ట్ర సాధనకు మూలకారణమై త్యాగముచేసినటువంటి పొట్టిశ్రీరాములుగారు ఏ గృహములో చనిపోయినారో దాన్ని ప్రభుత్వము తీసుకొని అదొక national movement క్రింద ఉంచడానికి 25 వేలరుపాయలు ప్రత్యేకించినందుకు మనమందరముకూడా గర్వించవలసిన విషయము. అది చాలా సంతోషమైనటువంటి విషయము. ఈ సందర్భములోనే ఒకటి మనవిచేస్తున్నాను. అది తక్కువ amount అనిపిస్తే చూస్తాము అనేవిధంగా ఉన్నట్లున్నది. అట్లుకాకుండా, దాని ప్రథమ priority ఇచ్చేసి దాన్ని తీసుకోవలసిందిగా నేను మనవిచేస్తున్నాను. అంతేకాకుండా, ఆ గృహములో ప్రవేశించేటప్పుడు శ్రీరాములు విగ్ర

హాము అగుపడేటట్లు ఎదురుగా ఒక కంచువిగ్రహాన్ని అక్కడ ఏర్పాటుచేయడంకూడ దీంట్లో ప్రధానభాగముగా ఉండేటట్లుచేయవలసిందని కోరుతున్నాను.

తరువాత దీంట్లో నాగార్జునసాగర్ రోడ్డువిషయము ఒకటి ప్రస్తావించబడి ఉన్నది. అది ప్రాజెక్టుమొత్తము పనిలో ఒక భాగమే. దీనికి ప్రథమ పంచవర్ష ప్రణాళికలో మొత్తము 40 కోట్లరుపాయలు ఉంచడం జరిగిందని చెప్పారు. ఆ డబ్బులో ఎంత అయితే మనకు రావలసియున్నదో అంత వెంటనే తీసుకోవలసి ప్రయత్నం చేయవలసియున్నదని నేను మనవిచేస్తున్నాను. దాంట్లో మిగిలి పోయినదాన్ని వెంటనే మనం ఉపయోగించుకోవలసి యున్నది. రాబోతున్న పంచవర్ష ప్రణాళికలో డబ్బు తక్కువగా ఉంటుందిగనుక, వెనుకలది అట్లే విడిచి పెడితే నష్టంవస్తుందిగనుక, ఆ మిగిలిపోయిందికూడ లెక్కకట్టుకొని, దాన్నికూడ ఉపయోగించుకొని, ఈ అయిదు సంవత్సరములలో పనిచేయవలసిందని కోరుతున్నాను.

తరువాత ఇందులో Engineering కళాశాలకు అదనంగా డబ్బు ఇచ్చారనేది చాలాసంతోషమైన విషయము. రాబోతున్నటువంటి ప్రాజెక్టులకు, ఇవి ఎంతో ఉపయోగకరంగా ఉంటాయి. అయితే Engineering విషయంలో ఒక ప్రధానవిషయం గమనించవలసియున్నది. ఇప్పుడు మనం కొత్తగా Engineering కళాశాలలు పెడుతున్నాము. ఇదివరకు ఉన్నటువంటి కళాశాలలు ఉన్నాయి. అంతేకాక, ఎంతోమంది Polytechnic institutions లో ఉన్నారు. ఈ institutions లో తయారైన విద్యార్థులు చాలామంది ఉన్నారు. వీరికి ఉద్యోగాలు ఏ విధంగా ఇవ్వాలి అనేసంగతి ఆలోచించకుండా, కొత్తకళాశాలలు ఏర్పాటుచేస్తున్నారు. అయితే రేపు నాగార్జునసాగర్ ప్రాజెక్టువద్దరా వచ్చేటప్పుడు ఎక్కువమంది కావలసిందే. కాని ఈ institutions లో తయారయ్యే విద్యార్థులు నిరుద్యోగానికి గురికాకుండా ఉండేపద్ధతి చూడకపోతే, ఇకముందు చేరే విద్యార్థులకు అంత ఉత్సాహంలేకుండా పోతుందని మనవిచేస్తున్నాను. ఇప్పుడు ఈ Licentiates S. S. L. C. pass అయి, మూడుసంవత్సరములు training పొంది, ఒకసంవత్సరం Engineering కళాశాల work shop లో apprentice అయినతరువాత, ఆరునెలలు ఎక్కడైనా పనిచేసిఉంటేగాని వారికి Public Service Commission ఉద్యోగం ఇవ్వడంలేదు. కాని బయట undertakingsలో వారికి ఎక్కడ ఉద్యోగం ఇవ్వడంలేదు. కనుక అటువంటివాళ్లు ఎంతమంది ఉన్నారో వాళ్లందరిని absorb చేసి వారికి ఉద్యోగాలు ఇచ్చే పరిస్థితి ఆలోచించవలసిందని మనవిచేస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :—Poly-technics లో pass అయి నిరుద్యోగులుగా ఉన్నవారు ఉన్నారా ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—చాలా మంది ఉన్నారు.

THE HON. SRI B. GOPALA REDDI :—అయితే, వాళ్లను నా దగ్గరకు పంపించండి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—వాళ్లు నిరుద్యోగులుగా ఎందుకున్నారంటే, వారికి ఉద్యోగం ఇచ్చేందుకు ఒక condition పెట్టారు. వారు apprentice తో సహా 4 సంవత్సరములు course అయిన తరువాత ఆరునెలలు వీరు ఎక్కడైనా పనిచేయాలి. కాని వీరిని ఎవరు చేర్చుకోనంటారు, నీవు మాదగ్గర ఉండేవాడివి కావు, machine పాడుచేస్తావు, అక్కరలేదంటారు. కనుక దానికి ప్రాతిపదిక ఏవిధంగా చేయవలెనో అదంతా మీరు engineering section లో ఆలోచించి, వారికి ఏదోవిధంగా అవకాశముకల్పించకపోతె, వారి qualification అంతా వృథా అయిపోతుంది. రెండవది, వీరికి B. E. చదవడానికికూడ అవకాశము లేదు. అట్లయినా పైకిపోదామంటే ఆవిధంగాకూడ అవకాశము లేదు. ఏదో ఒక సదుపాయము వాళ్లకు ఉండాలి. ఉదాహరణకు కలకత్తాలో ఒక వైద్యకళాశాల ఉన్నది. దాంట్లో ఒక course పూర్తిఅయిన పై course కు పోవడానికి సౌకర్యము ఇస్తున్నారు. అట్లాగె Engineering కళాశాలలోకూడ, Poly-technics లో పాస్అయినవారు, మేము ఇంక డబ్బు ఖర్చుపెట్టుకొని పై cource కు పోతామంటే వారికి అటువంటి అవకాశమివ్వాలి. ఆ విధంగా వచ్చినవారిని B.E.తో సమానంగా, అదే cadre లో తీసుకురావడానికి మార్గాలు ఆలోచించాలి. ఉన్నవారికి ఉద్యోగం ఇవ్వడమూ, పై course కు అవకాశము ఇవ్వడము, ఈ రెండు ప్రధానంగా ఆలోచించినప్పుడే ఈ కొత్తగా నిర్మింపబోయే Engineering కళాశాలయొక్క అభివృద్ధి చాలా బాగుంటుంది, చేరినవాళ్ళకుకూడ ఉత్సాహకరంగా ఉంటుంది. కనుక ఈ విషయాన్ని మీరు సమగ్రంగా ఆలోచించండని కోరుతున్నాను. ముఖ్యమంత్రిగారు అడిగినది చూస్తే, దీంట్లో నిరుద్యోగులు లేరేమోనని వారు అనుకొన్నట్లు తెలుస్తుంది. అంటే ఇది గవర్న మెంటు నోటీసుకు రాలేదన్నమాట. ఇప్పుడైనా తెలుసుకొన్నందుకు సంతోషమే. కనక అటువంటి వారు నా దగ్గరవస్తే, వారివద్దకు పంపుతాను. వాళ్లను absorb చేసుకోవలసిందని కోరుతున్నాను. కనుక విద్యావిధానంలో, ఈ Engineering కళాశాలకు వినియోగించేటటువంటి డబ్బువిషయంలో, నేను దాన్ని సంతోషపూర్వకముగా బలపరుస్తున్నాను.

తరువాత విద్యావిధానంలో ఇప్పుడు మనం అదనంగా పాఠశాలలు పెడుతున్నాము. S.S.L.C. బాగా pass అయి, unemploymentలో వున్నవారికోశం అనిపెడుతున్నామని చెప్పారు. అయితే S.S.L.C. training పాస్‌అయి మొత్తం certificates అన్ని తీసుకురావడంలో కష్టపడుతున్నారు. అసలు వారి services దేని క్రింద వస్తుందో వారికితెలియకుండావున్నది. అది గవర్నమెంటు సర్వీసుకు వస్తుందో జిల్లాబోర్డు సర్వీసుకు వస్తుందో, aided సర్వీసుకు వస్తుందో తెలియదు. అందువల్ల వాళ్లు ఏ cadre లో ఉండడానికి వీలు అవుతుందో ఆలోచించాలి. ఒకవేళ ఇటువంటివారు వెంటనే రావడానికి వీలులేకపోతే, కనీసం III Form పాస్ అయి training అయినటువంటి నిరుద్యోగులకు అవకాశము ఇవ్వవలసిందిగా కేంద్రప్రభుత్వానికి తెలుపవలెనని మనవి చేస్తున్నాను. తరువాత ఈschools, దాదాపు అన్నిటిని District Board క్రిందనే నడపాలని ఆలోచిస్తున్నట్లు తెలిసింది. కాని, ఒకవేళ అవి aided schools క్రిందపెడితే చాలా చిక్కువస్తుంది. అందులో ఒకవేళ ఈ scheme రేపు రెండు జిల్లాలలోనే పెడితే, మళ్లీ ఆ రెండుజిల్లాలలో ఉండేవాళ్ళను అక్కడనుంచి కదలించడం చాలా కష్టమవుతుంది. కనుక ఇప్పుడే ఒక basis మీద ఏర్పాటు చేయవలసిందని కోరుతున్నాను. P.W.D. Workshop ఇక్కడ పెట్టాలని అనుకొంటున్నారు చాలా సంతోషము. అయితే ఇదివరకు తుంగభద్రలో ఒక workshop ఉన్నది.

Mr. DEPUTY SPEAKER :—రెండు రోజులు ఆగితే దాని సమాచారం తెలుస్తుంది.

SRI VAVILALA GOPALAKRIHNAYYA :—అది సరే, అది ఉన్నప్పటికికూడ, అది రేపు వచ్చినాకూడ, ఇక్కడ మాత్రం చాలా పెద్ద workshop ప్రారంభించకపోతే మనము చాలా ఇబ్బంది పడుతాము. బహుశా ఆ ఉద్దేశంతోనే, చేసినారేమో అనుకొంటాను. పెద్దపెద్ద shutters పెద్దపెద్ద machines తయారు చేసేటటువంటి workshop ఏర్పాటు చేయవలసిందని కోరుతున్నాను.

తరువాతను, National Extension schemes ఉన్నాయి. వీటిలో Village Level Workers ను ఈ మధ్య చేర్చామని, వారికి new services create చేస్తున్నామని చెప్పారు. అయితే వీళ్ళను ఏ పద్ధతిలో తీసుకొన్నారు, ఎంత మందిని తీసుకొన్నారు, ఒకటే qualification ఉన్నవాళ్ళను తీసివేయవలసిన అవసరమేమిటి, ఇవన్నీ చాలా సమగ్రంగా ఆలోచించవలసిన అవసరమున్నది. ఈ National Extension schemes కు village workers గా application పెట్టినవాళ్ళలో చాలా తీవ్రమైన అసంతృప్తి ఉన్నది. కనుక అందరి సంతృప్తికోటి

మన కార్యక్రమాన్ని నడుపవలసిన అవసరమున్నది. యువకులను తీసుకువచ్చి ముందు నడపవలసిన అవసర మున్నది. Bombay Government వాళ్లు, తరువాత National Planing schemes వాళ్లు ఆ తరువాత Community Project వాళ్లు ఖచ్చితంగా చెప్పుతున్నారు. Revenue Department లోని వాళ్ళను ఈ National Extension Scheme లో పెట్టవద్దు అని ఈ village workers నుంచినో, లేక agriculture లో పరీక్షలు పాస్ అయి బాగా నిపుణత ఉండి, ప్రజలకు సహాయంచేసి ప్రజాభివృద్ధికి పనిచేసినవాళ్ళను మాత్రమే తీసుకోండి అని integrated Plan వాటిలో చెప్పి ఉన్నారు. అందువల్ల ఇది యువకులను ఉత్సాహపరచే టటువంటి పద్ధతిలో జరగాలి కనుక యువకులను నిరుత్సాహపరచి మొగమాటలతో చేసే పద్ధతిలో నడుపవద్దు అని చెప్పుచున్నాను. ఆ విధంగా చేసిన పొరబాట్లువున్నాయి. ఇది Public Service Commission తోటి జరిగింది కాదు. Planning and Development Sections ద్వారా జరిగింది. అందు వల్ల మాకు తెలియదు, మేము ఏమి చేస్తాము, Public Service Commission ను ముట్టుకోడానికి వీలులేదు అని చెప్పడానికి వీలులేదు. అందువల్ల ఆ విషయాన్ని మళ్ళీ ఆలోచించవలసిందని మనవిచేస్తున్నాను. తరువాత దీంట్లో new services గురించి ప్రతి దాంట్లో ఉదహరించారు. నేను ఇదివరకు ఒకసారి Budget Manual చదివినప్పుడు, ఈ new services గురించి వేరే pamphlets తెస్తారు. దీన్ని సభ్యులందరు చదువుకోవడం మంచిదని అందులో చెప్పబడింది. దానిమీద Finance Department వారు అవి ఇంకా తయారు కాలేదని వ్రాశారు. అసలు ఉండవు అంటే. నేను అర్థం చేసుకోనలేను. కాని తయారు కాలేదు, కాగానే పంపిస్తామని చెప్పారు. కానివల్ల, నేను ఇన్నాళ్లు చూశాను, ఎక్కడైనా ఈ new service అగుపడుతుందేమో అని. ఈ వేళ అగుపడుతూంది, "New services" అనే ఒక heading ఈ మొత్తం బడ్జెటులో. అందువల్ల ఈ new services కు సంబంధించినటువంటి నిబంధనలు ఏమి ఉన్నాయో, అవి సభ్యులందరికి అందజేస్తే రేపు వచ్చేటటువంటి services వాటి workings, ఇవన్నీ చర్చించుకోడానికి చాలా ఉపయోగపడుతుంది.

THE HON. SRI B. GOPALA REDDI :—పోయిన మాసములో Finance Committee వారు యీ బడ్జెటు విషయములో ఆ technical terms అన్నీ కూడా explain చేస్తూ ఒక చిన్న pamphlet వేసి, మెంబర్ల కందరికి యిచ్చారు. అది గోపాలకృష్ణయ్యగారికి అందిందని అనుకుంటాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—నాకు అంద లేదండి.

THE HON. SRI B. GOPALA REDDI :—పంపించియున్నాకే అందరికినీ! యిక్కడ కమ్యూనిస్టు పక్షమువారికి గూడ అందిందని అంటున్నారే. బహుశ గోపాలకృష్ణయ్యగారు ఎక్కడికైనా సంచారానికి వెళ్ళినప్పుడు, అది పోస్టులో పంపించివుంటారు కాబట్టి అది వారికి అందియుండకపోవచ్చును. అందక పోతే మరల కాపీలు పంపించే ఏర్పాటు చేస్తారు. ఈ new services ను గురించి కొంతమటుకు discuss చేస్తూ, what constitutes the new services అనేది అందులో discuss చేయబడ్డది. అది వారు చూడవచ్చును.

SRI VAVILALA GOPALAKRISHNAIAH :—అందువల్ల వాటి వివరాలతో సహా నాకు కావలసిన అవసరమున్నది. ఎందుకంటే Budget Manual నేను చదివినప్పుడు, ఆ సమస్యను నేను అర్థము చేసుకోటానికి, యీ details లేకపోవడము చాలా ప్రధానంగా అడ్డము వచ్చింది. దీనికోసము నేను Finance Secretary కి వ్రాశాను. రాగానే పంపిస్తామని వారు నాకు జవాబు వ్రాశారు. కాబట్టి మనము యీ బడ్జటు సమావేశంలోగా New Services ను గురించి details వస్తాయని నేను ఎదురుచూస్తూ వచ్చాను. ఈ రోజున వచ్చిందిగనుక యిప్పుడు-దీన్ని గురించి చదివిచూస్తాను.

THE HON. SRI B. GOPALA REDDI :—గోపాలకృష్ణయ్యగారు చెప్పింది నాకు సరిగా అర్థముకాలేదు. అంటేవారు చెప్పేది "What constitutes new services" అని అర్థమా? అట్లా అయితే నేను యిచ్చిన ఆ pamphlet లోనే దాన్ని గురించి కొంతవరకు వుంది.

SRI VAVILALA GOPALAKRISHNAIAH :—దానిలో నేను ఒక విషయము తెలుసుకోవలసి వున్నది. "New services" అనేది ఎట్లా work చేయిస్తారు. అందులో ఎవరెవరు వుంటారు? Staff ఎంత వుంటుంది? వాటిని గురించి ఖర్చు ఎంత అవుతుంది? ఇవన్నీకూడా యీ services లోకి వస్తాయి. ఇటువంటి details అన్నీ వున్నప్పుడే, యీ new services ను గురించి నేను అర్థము చేసుకో గలుగుతాను.

SRI L. LAKSHMANA DAS :—ఉపాధ్యక్షా, ప్రభుత్వము యీనాడు ప్రవేశపెట్టిన యీ supplementary demands ను నేను హృదయపూర్వకముగా బలపరుస్తున్నాను. కారణమేమిటంటే, అది ఒకవిధమైన శుభసూచన అని నా అభిప్రాయము. బడ్జటు సమావేశముఅయిన వెంటనే ప్రభుత్వము యిటువంటి supplementary demands తో వస్తూవున్నదంటే ప్రభుత్వ కార్యకలాపాలు చాలా చురుకుగాచేస్తూ, ఎంతో వేగముగా ముందుకు తీసుకొని వెళ్లుతున్నారని,

Sri L. Lakshmana Das] [30th September 1955

అందుకు యీ Demands యే నిదర్శనమని అన్నిమాట. అయితే civil works కు సంబంధించినంతవరకు మా శ్రీకాకుళంజిల్లా విషయములో కొంచెము ఆలస్యము జరుగుతున్నదని చెప్పవలసివున్నది. ముఖ్యంగా పాతపట్టణంలో యిప్పటికి 17 సంవత్సరాలనుంచి తాలూకా ఆఫీసులేకుండా అద్దెయిళ్లలో వుంచినందువల్ల నానా బాధలు పడవలసివస్తున్నది. ఈమధ్య ఆఅద్దెయిల్లు పడిపోయిందని, ఆ ఆఫీసు అక్కడినుంచి యింకొక పల్లెటూరికి తీసుకొనిపోవాలని ప్రయత్నాలు జరిగినవి. కాని యిప్పటికి దాన్ని అక్కడ నేవుంచారు. ఈ సంవత్సరము అయినను అక్కడ తాలూకా ఆఫీసును ప్రభుత్వము కట్టుతారని అన్నారు. ఇంతవరకు కట్టించలేదు. ఇప్పుడైన అక్కడ తాలూకాఆఫీసుకు భవనము కట్టించి, తగిన వసతులు ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని హృదయపూర్వకముగా కోరుచున్నాను.

తరువాత రోడ్లకు సంబంధించినంతవరకు పాతపట్టణం తాలూకాలో రోడ్లవసతి చాలా తక్కువగావున్నది. ఆ జిల్లాలో అక్కడక్కడ కొన్నిరోడ్లువున్నవి. పాతపట్టణము తాలూకాలో యాభైమైళ్లదూరము పోవు estate roads వున్నవి. ఈరోడ్లు ఎప్పుడో జమీందార్ల హయాములో వేసినటువంటి రోడ్లు. ఈ రోడ్లు యిప్పటికి సుమారు యిరవైముప్పయి సంవత్సరాలుగా రిపేర్లు లేక చాలా చెడిపోయినస్థితిలో వుంటున్నవి. ఈ మధ్య యీ రోడ్లను జిల్లాబోర్డు స్వాధీనము చేసుకుంటామనిఅంటే, యివి జమీందారీ ప్రాంతము అయినందువల్ల, యింకా అవి ప్రభుత్వమువారి స్వాధీనముకాలేదని అన్నారు. ఇప్పుడు ఆ జమీందారీ ప్రాంతములకు ప్రభుత్వము స్వాధీనముచేసుకున్నది. గనుక యీ రోడ్లను త్వరలో రిపేరుచేయిస్తే, ఆ ప్రాంతపు ప్రజలకు చాలా సౌకర్యముగా వుంటుంది. ఆ ప్రాంత ప్రజలు ఒక చోటునుంచి యింకొకచోటుకు వెళ్లాలంటే, రహదారి సౌకర్యాలులేని కారణముచేత ప్రజలు చాలా బాధపడుచున్నారు. అనేకమైళ్లవరకూ యీ రోడ్లు చెడిపోయిన కారణమువల్ల బస్సులు నడవటానికి వీలులేనందున, ప్రజలు చాలా దూరము నడిచి పోవలసివస్తున్నది. ఈ రోడ్లు త్వరలో బాగుచేయిస్తే, ఆ తాలూకాఅంతా చాలా అనుకూలమైన రహదారిసౌకర్యాలు ఏర్పడుతాయి. ఇదేవిధంగా ఇచ్ఛాపురంలో famine roads ఏర్పాటుచేశారు. ఏనాడో వేసినరోడ్సు యివి. చాలామటుకు యివి చెడిపోయియున్నవి. అక్కడ ఇచ్ఛాపురంలో famine roads, ఉద్దానంలో famine roads ఏర్పాటుచేశారు. పోలాకి, బెల్లమెర అనేచోట్లలోగూడా Famine roads ఏర్పాటుచేశారు. ఎంతోడబ్బుకూడా ఖర్చుపెట్టారు. ఆ రోడ్లకుగాను తెచ్చిన రాళ్లు రప్పలు, యింకా యితర material ప్రక్కనవున్న పొలములలో పడివున్నవి. ఈ రాళ్లు, material అంతాగూడా యింతవరకు removo చేయలేదు. ఆ కారణముచేత రైతులు పొలములలో సాగుచేసుకోటానికి వీలులేకుండా

పోతున్నది. దీనివల్ల రైతులు చాలా యిబ్బంది పడుతున్నారు. ఆ రాళ్లు యింకా కోడ్లకుగాను వుపయోగించవచ్చును. వీటిని త్వరలో remove చేయించాలి. రైతులు పొలాలు సాగుచేసుకోటానికి వీలులేకుండా పోతున్నది. ప్రభుత్వమువారు శ్రద్ధతీసుకొని త్వరలో యీ రాళ్ళను అక్కడినుంచి remove చేయించవలసిందిగా కోరుతున్నాను. పాతపట్టణం తాలూకాలోవున్న జమీందారీ ప్రాంతము మొన్ననే ప్రభుత్వమువారి స్వాధీనములోకి వచ్చింది. ఆ తాలూకాలో irrigation sources చెరువులు పెద్దవిగాని చిన్నవిగాని అనేకమువున్నవి. ఈ చెరువులు రిపేరు చేయబడలేదు. ఈ చెరువులు యిప్పుడు జమీందార్ల చేతులలోనుంచి ప్రభుత్వమువారి స్వాధీనములోనికి మొన్న మొన్ననే వచ్చినవి గనుక ఆ తాలూకాలోవున్న చెరువులు అన్నిగూడా త్వరలో రిపేరుచేయిస్తే, రైతులు సాగుచేసుకొని పంటలు పండించుకోటానికి అనుకూలపరిస్థితులు ఏర్పడుతాయి. ఈ విషయము యిదివరకు ఎన్నోసార్లు ప్రభుత్వ దృష్టికి తీసుకొనిరావడమయింది. ఇప్పటికి నాలుగుమాసాలు అయినప్పటికినీ, యింతవరకూ ఒక యింజనీరుగాని, ఓవర్సీరుగాని, ఎవ్వరూకూడా అక్కడికివచ్చినట్లు కన్పించదు. ప్రభుత్వము యీ విషయములో ప్రత్యేకశ్రద్ధ తీసుకోవలసిందిగా కోరుతున్నాను. ఇందులో ఏ విధమైన ఆలస్యము లేకుండా అక్కడ ఒక డివిజను ఏర్పాటుచేసి ప్రభుత్వమువారు పనులు జరిపిస్తారని ఆశిస్తున్నాను.

ఇకపోతే విద్య విషయములో ప్రభుత్వమువారు క్రొత్తగా కొన్ని single-teacher schools ఏర్పాటుచేస్తున్నారు. ఇందుకు ప్రభుత్వమువారికి నా అభివందనములు తెలియజేస్తున్నాను. ఈ single teacher schools లో S. S. L. C. pass అయినవారినే ఉపాధ్యాయులుగా ప్రభుత్వమువారు ఏర్పాటుచేస్తున్నారు. కాని యీ విధానము విజయవంతముకాదు అని నా ధృఢనమ్మకము. కారణమేమిటంటే, వీరు S. S. L. C. pass అయినందువల్ల వారికి యిందులోయిచ్చే వేతనములు చాలకగాని, వుత్సాహము లేకగాని, వేరే ఉద్యోగాలకోసం ప్రయత్నించుకోటానికి అవకాశముంటుంది. మా జిల్లాలో కొన్నిచోట్ల యిటువంటిస్కూళ్లు ఏర్పాటు చేశారేగాని, వారు అక్కడ విద్యార్థులకు చదువుచెప్పకుండా యితర వుద్యోగములకొరకు ప్రయత్నముచేస్తున్నారు. S. S. L. C. pass అయినవారికి ఎక్కడికివెళ్ళినను వుద్యోగాలు దొరుకుతాయని ధైర్యముతో, యిక్కడ స్కూల్సులో శ్రద్ధతీసుకోవడంలేదు. అందువల్ల యీ single teacher schools లో S.S.L.C. తప్పినవారిని వేస్తేనే బాగుంటుంది. ముఖ్యంగా ఆడవారినివేస్తే యింకా విజయవంతము కాగలదని నాగట్టినమ్మకము. S. S. L. C. pass అయినవారికి యిందులో ఉద్యోగాలు కల్పించేదాన్నికన్నా, తప్పినవారికియిస్తే, ఎక్కువ బాగావుంటుంది. S. S. L. C. తప్పినవారికి ఎక్కడచూచినను ఉద్యోగాలు లభించక, చాలావుంది

Sri L. Laksmana Das] [30th September 1955

నిరుద్యోగులుగా తిరుగుతున్నారు. ఈ single teacher schools ను S. S. L. C. తప్పినవారికే యిస్తే వారు ఎక్కువ శ్రద్ధా భక్తులతో పనిచేస్తారు. ఈ scheme చాలా బాగా work out గూడా అవుతుంది. ఈ schools ఆడవారికే ఎక్కువ వుపయోగపడుతాయని నా అభిప్రాయము. స్త్రీలకుగూడ ప్రాతినిధ్యము యిచ్చినట్లవుతుంది. వారు యితర చోట్లకు పోజాలరు. ఈ స్కూల్సులో ఎక్కువ శ్రద్ధగాగూడా పనిచేస్తారు. మనదేశములో ప్యాసుఅయినవారికంటె, తప్పినవారే ఎక్కువమంది వున్నారు. ఇటువంటివారికిగూడా వుద్యోగాలు యీ మూలముగా లభించినట్లు అవుతుంది. నిరుద్యోగసమస్యగూడా చాలామటుకు పరిష్కారమవుతుంది. Pass అయినవారు యీ స్కూల్సులో స్థిరముగావుండరు. ప్రభుత్వము కేవలము S.S.L.C. ప్యాసుఅయినవారికి వుద్యోగాలు కల్పించడమే ప్రధానసమస్యగా తీసుకోకూడదు. ఈ స్కూల్సు తప్ప వేరేదారిలేదు అనుకునేవారికి యీ ఉద్యోగాలు యిస్తే, యీ స్కీము బాగుగ పనిచేయును. లేకపోతే, దీన్నిగురించి ఖర్చుచేసినదంతా వృధా యే అవుతుందనిన్నీ, యీ విషయము ప్రభుత్వమువారు గుర్తించాలి అని అంటున్నాను. అందువల్ల యీ స్కీమును అమలుజరిపే విషయములో కొంతదీర్ఘాలోచన చేయలసిందిగా వకోరుతున్నాను.

ప్రతితాలూకా హెడ్‌క్వార్టర్సులోనే గాకుండా తాలూకాలకు interiorలో కూడా electricity కావాలని అంటున్నారు గనుక ప్రభుత్వమువారు యీ electricity ను కనీసము ప్రతితాలూకా హెడ్‌క్వార్టరులోనైనా ఏర్పాటు చేస్తున్నందులకు ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. ముఖ్యముగా మా పాతపట్టణము తాలూకా విషయము నేను చెబుతున్నాను. మా పాతపట్టణము తాలూకాలో ఎక్కడ చూచినప్పటికినీ ఒక electric దీపముకూడా కన్పించదు. అక్కడి ప్రజలకు యీ electricity దీపము అంటే, ఎటువంటిదోగూడా తెలియదు. మాకు 21 మైళ్ళ దూరములో కొక్కిలి వున్నది. అక్కడివరకూ electric lines వచ్చాయి. అక్కడనే రైలుమార్గమునుంచి కొక్కిలికి electric lines వేస్తే ప్రజలకు చాలా సౌకర్యముగాకూడా వుంటుంది. అనేకగ్రామాలు ఆప్రాంతములో వున్నవి. అక్కడ రైలులైనుతోబాటు electricity ని కూడా వచ్చేటట్లు ఏర్పాటు చేస్తే, అక్కడవున్న ప్రజలకు వ్యవసాయము చేసుకోటానికిగూడా. చాలా ఉపయోగముగా ఉంటుంది. అక్కడ చాలా సారవంతమైన భూములున్నవి. జమీందార్ల హయాములో అక్కడవున్న irrigation sources కూడా చాలాభాగము పాడైపోయి యున్నవి. అందువల్ల ప్రజలు వ్యవసాయాభివృద్ధిలేకుండా చాలా దెబ్బ

తింటున్నారు. ఇప్పుడు ఆ ప్రాంతాలలోవున్న irrigation sources ను అభివృద్ధి పరచేటట్లయితే, భూములమీద రెండవపంటకూడ పండించడానికి అవకాశము వుంటుంది. అక్కడ ఎక్కడచూచినను కావలసినంతనీరు వున్నది. నీటి పారుదలకు అవకాశాలున్నవి. Electricity ని ఏర్పాటుచేస్తే, irrigation కు, వ్యవసాయానికి చాలా అనుకూలము ఏర్పడును. కాబట్టి అక్కడ electricity ద్వారా వ్యవసాయము అభివృద్ధి చెందడమే కాకుండా, గ్రామాలకుగూడ విద్యుచ్ఛక్తి ఏర్పాటు చేసినట్లవుతుంది. అక్కడకు electricity ని తీసుకొనివస్తే, అక్కడ నదులు, సెలయేళ్ళలోను పారేటటువంటి జలమంతా పంపులద్వారా పొలాలకు నీరు పారించుకోవచ్చును. ఇక్కడ పండే పంటవల్ల "This is the granery of the ntire district" అని ప్రతిఒక్కరు చెప్పకోటానికి వీలువుంటుంది. ప్రజలు ఆ విధంగా చెప్పకుంటారు, ఎటువంటి కరువు కాటకాల సమయములోగూడా పాతపట్టణము తాలూకాలోవున్న భూములు, అక్కడ సకాలములో వర్షాలు వుండడమువల్ల అక్కడవున్న కొండలు, వాగులు, నదులగుండా పారేటటువంటి నీరుతో పండే పంటలు, జిల్లా మొత్తముకు సప్లయిచేస్తూవుండే ప్రాంతముగా వుంటున్నది. Irrigation sources చెడిపోయినప్పటికినీ, కొండవాగులలోనుంచి పారే జలముతోనే ఎక్కువగా పంటలు పండించగలుగుతున్నారు. కొత్తగా irrigation sources నిర్మించవలసిన అవసరముకూడా ఎక్కువలేదు. ఇప్పటికిగూడా సుమారు రెండువేల irrigation sources వున్నవి. జమీందారీ యేరియాలో మిట్టలమీద చిన్న చిన్న చెరువులుకూడా ఎన్నోవున్నవి. ఈ చెరువులు అన్నీకూడా యిప్పటికి సుమారు ఇరవై సంవత్సరాలుగా జమీందార్ల చేతులలో వున్నందువల్ల చాలాభాగము neglect కాబడి చెడిపోయి యున్నవి. అందువల్ల యీ irrigation sources అన్నీగూడా దెబ్బతింటున్నవి. ప్రభుత్వమువారు యీ irrigation sources విషయములో తగుశ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను. ఇప్పటికి ఇప్పుడే, వెంటనే కాకపోయినను, వచ్చేబడ్జెటు సమావేశము లోపలనైనను ఆ irrigation sources అన్నీగూడా బాగుచేయించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri P. NARASIMHAPPA RAO :—ఉపాధ్యక్షా, ఈ సప్లిమెంటరీ డిమాండును నేను బలపరుస్తూ కొన్ని ముఖ్యమైన విషయాలు ముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను. మా శ్రీకాకుళం జిల్లా చాలా backward జిల్లా అని నేను మొదటిలోనే మనవిచేసియున్నాను. ఈ సంగతి వారికికూడా పూర్తిగా తెల్లుసును, మా శ్రీకాకుళం జిల్లాలో ఏదైనా కాలేజివున్నదా అంటే, ఏదో ఒకటి నామకః

Sri P. Narasimhappa Rao] [30th September 1955

వున్నది. Veterinary college కి పునాది మాత్రం వేశారు. దీన్ని త్వరలో మా జిల్లాలో కట్టించవలసిందిగా కోరుతున్నాను.

రెండవ విషయము, మా పాలకొండ తాలూకాలో agricultural farm పెట్టటానికి యిదివరకు Government proposals వున్నవి. దానికి సరిపోవు స్థలముకూడా వున్నది. కావలసినంత నీరు వున్నది. కాబట్టి యీ farm విషయములో త్వరలో యీ బడ్జటులో provide చేసి, వెంటనే ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

మూడవ విషయము. మా జిల్లాలో నాగావళి నది అనేది ప్రవహిస్తున్నది. ఇది యిక్కడికి నూట ఎనభై మైళ్ళ దూరములో పుట్టి ప్రవహిస్తున్నది. ఇందులో ఎల్లప్పుడు నీరు పారుతునే వుంటుంది. పంటలకు చాలా అనుకూలమైన నదిగా వున్నది. ఇది చాలా ప్రసిద్ధమైన నది. దీనికి ఒక చిన్న పురాణకథ వున్నది. ఈ నదియొక్క పూర్వచరిత్రను బట్టి దీనికి నాగవళి నది అని పేరు వచ్చింది. అదేమిటంటే, ఆనాడు పాండవులు దుర్యోధనుడు యుద్ధము చేసే టైములో వారు బలరాముని సహాయముకోరవలసి వచ్చింది. అప్పుడు వారికి సహాయము చేయుటానికి యిష్టము లేక కళాహిందువద్ద కంచులగూడెం అనే ఒక గ్రామము వద్ద నైమిశారణ్యము వున్నది. అక్కడ మునులు తపస్సు చేసుకొనుచుండేవారు. అందులో శ్రౌనికాది మహామునులు తపస్సు చేస్తున్న సమయములో బలరాముడు అక్కడికి వెళ్ళేటప్పటికి, భారతగోష్ఠి ప్రారంభమవుతున్న సమయములో ఒక్క సూతుడు తప్ప తక్కిన వారందరు లేచి నిలబడ్డారట. సూతుడు నిలబడని కారణమువల్ల బలరామునికి కోపమువచ్చి సూతుని కొట్టి చంపి వేశాడట. అప్పుడదది బ్రహ్మహత్య పాతకమయిందని, యీపాతకమునుంచి తప్పించుకొనటకు బ్రహ్మను ప్రార్థించగా యీ నాగావళినది ఒడ్డున అయిదు యీశ్వరలింగాలను ప్రతిష్ట చేసినట్టయితే, ఆ పాపము పోతుందని బ్రహ్మ చెప్పాడట. అప్పుడు బలరాముడు నాగలి తీసుకొని శ్రీకాకుళందాటి కుప్పిలి వరకూ సంగము, బిటివాడ వగైరా గ్రామాలు మొదలుకొని శ్రీకాకుళంవద్ద అయిదు ఈశ్వరాలయాలు స్థాపించాడు. అప్పుడు యీ నాగావళి పుట్టినట్లు, యిందులో 68 నదులు కలుస్తున్నట్లు పెద్దలు పూర్వచరిత్ర చెప్పారు. బిటివాడ సంగము అని అక్కడ వున్నది. సంగమువద్ద మూడు ఏర్లు కలుస్తున్నవి. అక్కడి నుంచి యీనది పొంగినందువల్ల ఏర్లు అన్నీ కలుసుకొని ప్రవహిస్తూవున్నవి. ఈ నదులన్నీ పొంగినప్పుడల్లా దిగువవున్న గ్రామాలు అన్నియు కొట్టుకొనిపోతున్నవి. ఈనదులన్నీగూడా చాలాలోతుగా వుంటాయిగాని, నాగావళి నది మాత్రము లోతుగా వుండదు. దీనికి కారణం యేమిటంటే, యీ నాగావళి నది కొండ ప్రాంతాలలో ఎత్తు ప్రదేశాల గుండా పారుతూవున్నది. ఎక్కడ చూచినా

నీటియొక్క వడికి అక్కడక్కడ దిబ్బ వేస్తూవుంటుంది. ఆ కారణముచేత యీ నాగావళి ఎక్కువలోతుగా వుండదు. తక్కిన నదులు దిగువ ప్రాంతాలలో ప్రవహించడమువల్ల చాలాలోతుగా వుంటాయి. నాగావళి నదికి ఆనకట్టకట్టేటట్లయితే అది ఎత్తు ప్రదేశములలో పారుతున్నందువల్ల, ఎక్కువ ఖర్చు అవసరములేదు. అందువల్ల రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సమయములోనైనా నందివాడవద్ద ఆనకట్ట కట్టటానికి పని ప్రారంభిస్తే, దానికి దిగువున ఎన్నో గ్రామాలు వున్నవి. ఆ గ్రామాలకన్నిటికి యీ నీరును పారించటానికి వీలుగా వుంటుంది. మిగతా చీపురుపల్లి, పాలకొండ తాలూకాలకుకూడా నీరు పారించటానికి అవకాశము వుంటుంది. కాబట్టి ప్రభుత్వమువారు యీ నాగావళి నదికి నందివాడవద్ద ఆనకట్ట ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సమయములోనైనా ప్రారంభిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

1 p. m.

SRI P. SATYANARAYANA:—అధ్యక్షా! మా జిల్లాలలో, మా నియోజక వర్గాల్లో ఏమేమి కావలయునో అవన్నికూడా చరిత్రలు చదవడం అనేది ఇప్పుడు ఏమీ చేయవద్దని ఉపాధ్యక్షులవారు మొదటనే చెప్పారు. అందుచేతనే అందులో వున్నటువంటి కొన్ని పద్దులమీద మాత్రమే నేను మనవిచేస్తాను. ఇప్పుడు 36 వ నెంబరు గ్రాంటులో కమ్యూనిటీ ప్రాజెక్టులువుండే పద్దులు total grants క్రింద 3, 4 అయిటము National Extension Services, Community Projects వారియొక్క staff ఖర్చులనిమిత్తము మొత్తము 31 లక్షల రూపాయలవరకు కూడా అందులో ఖర్చు కనిపిస్తున్నది. దాని వెనుక కొంతచరిత్ర వున్నది. నేను కమ్యూనిటీ ప్రాజెక్టు ఏరియానుంచివచ్చిన వాడిని. ఎప్పుడో 3 సం॥ల కాలమునకు 60 లక్షలరూపాయలు ఖర్చు పెట్టమని allotment మొదటనుంచి వున్నప్పటికి ఏదో కొన్ని కారణాలవల్ల ఖర్చుపెట్టబడలేదు. ఆ కారణాలకు ఎక్కువగా సమర్థత లేకపోవడమువల్ల అనేది కూడా వున్నట్లు evaluation committee report లోను Central Government వారు ప్రకటించినటువంటి రిపోర్టులోనూ ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులమీద ఒక విమర్శవున్నది. అదే పెద్దకారణము కావచ్చును. ఆ కారణంగా చాలా సొమ్ము ఖర్చుపెట్టలేక పోయారు. అర్జీలు చాలా వచ్చినవి. సహకారము చేస్తామనికూడా ప్రతిపాదనలు చాలావచ్చినవి. ఎక్కడ చిక్కువున్నదో కాని డబ్బు ఖర్చు అవలేదు. అన్నిటికంటె పెద్దలోపము ఎక్కడ కనిపిస్తున్నదంటే వ్యవసాయానికి నీటి పారుదల, కుటీర పరిశ్రమలకు, విద్యకు వివిధరకాలుగా చేయబడినటు allotmentsలో వున్నది. కుటీరపరిశ్రమలకు 100 కి 3 వంతులు మాత్రం మూడు సంవత్సరములలో ఖర్చు పెట్టబడింది. నిలువవున్నది కాబట్టి ఈ సంవత్సరములో మళ్ల వెనక్కుపోతుందేమో, అట్లా పోవడమువల్ల evaluvation రిపోర్టుయొక్క దృష్ట్యాకూడా ఇంకా పెద్ద రిమార్కులు వస్తాయనే దృష్టితోనే ఈ డబ్బును ఈ విధంగా ఆదుర్దాతో ఖర్చు

పెట్టడము జరుగుతోంది. Buildings మీద, అందులో ముఖ్యముగా ఈ staff నివాసానికి కావలసినటువంటి భవనాలు అని చెప్పి 30 లక్షల రూపాయలు అనవసరపు ఖర్చు చేస్తున్నారు. ఇది ఎంతమాత్రము సమర్థనీయము కాదు. ఇప్పటికైనా సమయం మించలేదు. కొత్తస్కీములు కావాలి అంటే 1, 2 మాసముల టైము ఇచ్చినట్లయితే ప్రజల సహకారము వస్తుంది. తప్పకుండా స్కీములు తయారు చేసుకోవచ్చును. ఉదాహరణకు cottage industry విషయంలో కమ్యూనిటీ ప్రాజెక్టు ఏరియా గురించి విశ్వేశ్వరయ్యగారి స్కీము అమలు జరుపమని స్పష్టమైన సలహాలు వున్నాయి. విశ్వేశ్వరయ్యగారి స్కీముయొక్క మూలసిద్ధాంతము 10, 12 గ్రామాలను ఒక యూనిటీగాచేసి, అందులో ప్రతి గ్రామానికి ప్రాతినిధ్యము వుండేట్లుగా ప్రతి పరిశ్రమకు ప్రాతినిధ్యము వుండేట్లుగా కుటీర పరిశ్రమలయొక్క కమిటీ ఒకటి వేయమని, ఆ కమిటీల సహకారంలో స్కీము తయారుచేస్తూ, అమలు జరుపుతూ వుండడమనే సిద్ధాంతం. దానిని ఎంతమాత్రము లక్ష్యము చేయలేదు. అమలు జరగడము లేదు. కమిటియే వేయలేదు. ఎందువల్ల అమలు జరుపలేదంటే, వేయలేదని అంటే, District Planning Committees లో కమ్యూనిటీ ప్రాజెక్టుయొక్క కమిటీ మీటింగులో మేము అక్కడ ప్రశ్నించితే దానికి ఏదో ఒక డైరెక్టరును వేసినాము, అతనే స్కీము తయారుచేస్తారు, అందుచేత కమిటీ అవసరము లేదు అన్నారు. అట్లా ఒక ఆసామిని వేసినారు. 3 సంవత్సరములో 2 సంవత్సరములో పనిచేసినారు. Allocation అయినా మొత్తములో 100 కి 3 వంతులు ఖర్చు పెట్టినారు. ఆ విధముగా పరువు పోయినప్పటికి ప్రతిష్ట దక్కించుకుందామని చెప్పి డబ్బు అంతా జమ అయినట్లు మాపిస్తాముని మళ్ళీ డబ్బు 30 లక్షలు రూపాయలను అనవసరంగా staff యొక్క buildings కోసం హెచ్చిస్తున్నారు. ఇది ఎంతమాత్రము సమర్థనీయము కాదు. కాబట్టి ప్రభుత్వము పునరాలోచించి ఈ పద్ధతినిమాత్రం విరమించవలసినదని, ప్రజలకు అవసరమైనటువంటి స్కీములు తయారుచేయడానికి ఈ 30 లక్షల రూపాయలు కూడా వినియోగించాలని నేను కోరుతున్నాను.

Sri P. BAPAYYA :—అధ్యక్షు మహాశయా, ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన ఈ సప్లిమెంటరీ డిమాండును నేనుబలపరుస్తున్నాను. అందులో ముఖ్యముగా తిరువూరు నియోజకవర్గానికి సంబంధించినటువంటి స్కీము విద్యుచ్ఛక్తిని తిరువూరు, విస్సన్నపేట ఫిర్కాలకు సప్లయిచేయడం, ఈ డిమాండులో వున్నది. అది మా నియోజకవర్గ ప్రజలందరికీకూడా చాలా ఆనందమైన విషయము అయినందువల్ల ఎంతో సంతోషముగా ఈ డిమాండును నేను బలపరుస్తున్నాను. అయితే యీవిద్యుచ్ఛక్తి స్కీమువిషయములో జరుగుతున్న జాప్యము ప్రభుత్వమువారి దృష్టికితీసుకువస్తున్నాను. అది sanction అయిందని టెండర్లు ఎప్పుడో పిలిచారని తెలిసింది. టెండర్సు open

చేశారనికూడా తెలిసినది. ఈ open చేయడం ఇప్పటికి రెండుమాసములు అయి నప్పటికికూడా టెండర్లు నిర్ణయించడముగాని పని ప్రారంభించడముగాని జరుగలేదు. వచ్చేమార్చిలో ఈ విద్యుచ్ఛక్తిపని అంతా పూర్తికావలసి వున్నది. అందువల్ల వెంటనే పనికావడముకొరకు టెండర్లమీద ఆధారపడకుండా ప్రభుత్వమే స్వయంగా పనిప్రారంభిస్తే త్వరగా అవుతుంది. వచ్చేసంవత్సరం మార్చిలో మాతిరువూరు తాలూకాలో ఏ ఏ గ్రామాలకు విద్యుచ్ఛక్తి sanction అయిందో వాటికి తప్పక సప్లయి అవుతుందని విద్యుచ్ఛక్తి శాఖామంత్రిగారు చెప్పారు. ఆ ప్రకారం సప్లయికావాలంటే, ఈ టెండర్లమీద ఆధారపడితే కాదని మాకు భయంగావున్నది. మరికొన్ని విషయాలు ఈ డిమాండు సందర్భములో తిరువూరు నియోజకవర్గానికి సంబంధించినవి ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. ఈ నియోజక వర్గమంతా national extenssion scheme క్రిందకూడా వున్నది. అందువల్ల తిరువూరు head quarters లో ఇదివరకు L. F. Dispensary మాత్రమే వుండేది. ఇప్పుడు N.E.S. scheme లో వున్నది కాబట్టి అక్కడవున్న ఆ L. F. Dispensary, health centre గా చేసి గవర్నమెంటు తీసుకున్నదని చెప్పుతున్నారు. అయితే తాలూకా headquarters అన్నింటిలో గవర్నమెంటు ఆస్పత్రులు ప్రభుత్వం పెడుతోందని ఇదివరకు ప్లానింగు మంత్రిగారు చెప్పారు. దీనిని health centres గా మార్చి నందువల్ల ఇది ఆస్పత్రిగా మారకుండా కేవలము dispensary గానే వుండిపోయింది. అందువల్ల దీనికి ఆస్పత్రి status రాలేదు. ఆ కారణంవల్ల inpatients గా వుండేటటువంటి రోగులకు కావలసిన సౌకర్యాలు కలుగుటలేదు. ఇదే కాకుండా దానిని health centre గా మార్చడంవల్ల అక్కడ వుండేటటువంటి doctor చుట్టుప్రక్కల వున్నటువంటి గ్రామాలలో సంచారము చేయవలసిన అవసరం ఏర్పడింది. అందువల్ల డాక్టరు కొన్నిరోజులు మాత్రమే హెడ్‌క్వార్టరులో వుండటము జరుగుతోంది. కొన్నిరోజులవరకు ఆస్పత్రిలో డాక్టరు లేకుండా వుండటము వల్ల రోగులు చాలా ఇబ్బంది పడుతున్నారు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—వారు చెప్పినది సరిగాదని నా అభిప్రాయం. హెల్తు సెంటరులోవున్న డాక్టరు అవసరంకోరి కొన్నిగంటలు ప్రక్కగ్రామాలకు వెళ్ళాలిగాని రోజులతరబడి లేకపోవడమునకు వీలులేదు.

Sri P. BAPAYYA :—ఒకొక్కరోజున డాక్టర్లు అసలు వుండటము లేదని నాకు సమాచారము వచ్చింది. కొన్నిగంటలు అయినట్లయితే సంతోషమే. అక్కడ ఒకటి female ward వున్నది. ఒకటి male ward వున్నది. ఒకటి

maternity ward వున్నది. ఇవన్నీకూడా పూర్వము గిల్లుసొసైటీవారు జిల్లా బోర్డువారు కట్టించారు. ఇక్కడ అన్ని అవకాశాలు ఉన్నా ఇంతవరకు lady doctor అక్కడకు రాలేదు. ఉన్న డాక్టరుకూడా సంచారము చేయడమువల్ల ప్రజలకు చాలా ఇబ్బందిగా వున్నది. గనుక దానిని ఆస్పత్రిగానే చేయించవలసిందని కోరుతున్నాను. ఇది హెల్తు సెంటరుగా వుండటమువల్ల dispensary గానే వుంటుంది. కాబట్టి అది తాలూకా head quarters గనుక దానిని అస్పత్రిగా మార్చి అదనపు సౌకర్యములు కలుగచేయువలసినదని మంత్రిగారిని కోరుతున్నాను.

తిరువూరుప్రక్కన కట్టలేరు అనే యేరువున్నది. దానిపైనున్న bridge గత సంవత్సరం వర్షాలవల్ల నాల్గుకమానులు క్రుంగిపోయినవి. అప్పటినుంచి ఇప్పటివరకు దానిపై ప్రయాణసౌకర్యం లేకుండా వున్నది. ఎక్కువ load ఉన్న అన్నిబస్సులను లారీలను దానిమీద నడవనివ్వడంలేదు. ఈ సంవత్సరం షుమారు నెలరోజులక్రింద కురిసిన పెద్దవర్షములవల్ల ఇంకా రెండుకమానులు క్రుంగిపోయి అటుఇటు నడవడానికి వీలులేని పరిస్థితులు ఏర్పడ్డవి. అటువుండే బస్సులు లారీలు అటు, ఇటువుండేవి ఇటు ఉండిపోతున్నాయి. సరకులను మనుష్యులను రెండవవైపుకు చేరవేసుకోడం జరుగుతోంది. గతసంవత్సరమే బ్రిడ్జి మరమ్మతులకు ఒక proposal ఉన్నట్లు విన్నాను. కాని గతసంవత్సరం పని జరగలేదు. ఈ సంవత్సరమైనా తప్పకుండా మరమ్మతులు వెంటనే చేయించాలి అని కోరుతున్నాను. అట్లాచేయకపోతే ప్రయాణాలకు చాలాకష్టం. తిరువూరు Taluk headquarters, National Extension Scheme క్రిందకూడా వున్నది. అనేకమంది officers ప్రజలు అటూ యిటూ రావలసిన అవసరం వున్నది. ఈ డిమాండులోనే దానిని repair చేయించడానికికూడా డబ్బు sanction చేయించవలసిందిగా కోరుతూ సెలవు తీసుకుంటున్నాను.

SRI P. GOPALU REDDI :—అధ్యక్షా, ఈనాడు ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తున్నాను. ఈ సందర్భంలో ప్రజల్లో ఉండే కొన్ని ఇబ్బందులను ప్రభుత్వదృష్టికి తీసుకురావలసిన కర్తవ్యం నామీదఉన్నది. చిత్తూరు జిల్లాలోజరిగిన విషయాల ప్రభుత్వంలో అనాదరణ ప్రభుత్వ దృష్టికి తీసుకునిరావలసిన ప్రమేయం ఉన్నది. ఉదాహరణకు ఆరునెలలకు జరిగే Irrigation Conference లో జరిగిన చర్చలు కొంత ఆశ్చర్యానికి కారణమైనది. అనేకమంది జిల్లా ఆఫీసర్లు ఈ Irrigation Conference కు రాగలిగారుకాని agenda అనేది ఒక నిర్ణితమైన పద్ధతిలో జరగలేదు. శాసనసభ్యులు ఇతర గ్రామస్థులు ఇచ్చుకొన్న అర్జీలతో తయారైన నమూనాలిస్టు ఒకటి తయారుచేసి ఆ లిస్టులోని పనులు ఎప్పటికప్పుడు చేసేదానికి తీసుకునేటటువంటి చర్యలతో agenda తయారు అయి

నదికాని Executive Engineer, Assistant Engineer కలెక్టరు, డిప్యూటీ కలెక్టరు అందరూచేరిన సమావేశంలో ఆ జిల్లాలో ఉండే నీటివసతుల సౌకర్యాన్ని ఏవిధంగా ప్రజలకు ఉపయోగపరచాలనే స్కీము తయారుచేసే పద్ధతిమీద చర్చ జరుపుకొనడానికి అవకాశం లేకపోయింది. అటువంటి సూచనను ఈ ప్రభుత్వదృష్టికి అప్పుడప్పుడు తెచ్చినా దాని మంచిచెడ్డలను సౌలభ్యాన్ని గమనించలేదు. బాధ్యతగలిగిన ఉద్యోగస్థులు మెంబర్లు అడిగిన subjects మీద కొన్ని estimates తయారైనాయి. కొన్ని పరిశీలన చేస్తున్నాము. కొన్ని ఇకమీదట తీసుకోబోతున్నాము. 1956-57 లో ఈవిషయాలను గమనిస్తాము. ఈ మాదిరి సమాధానాలు సభ్యులకు అంద చెశారుకాని ఒకనిర్ణీతమైన తీర్మానాలు చేసుకోడానికి అవకాశంలేకుండా పోయింది. అదేప్రకారంగా తిరుత్తణితాలూకా ప్రజలు అనేకపర్యాయాలు మహజర్లు పూర్వకంగా electricity విస్తరణకోసము వ్రాసుకుంటుంటే ప్రతిసారికూడా Estimate Superintending Engineer దగ్గర ఉన్నది, Executive Engineer దగ్గరవున్నది, అక్కడ ఉన్నది, ఇక్కడ ఉన్నది, అని అంటున్నారుగాని నాలుగుసంవత్సరాలుగా కృషి జరిగినదానికి ఒకస్థిరమైనస్థితి రాలేదని విచారంతో చెప్పుకోవలసి ఉంటుంది. విద్యుచ్ఛక్తివిస్తరణ చిత్తూరు జిల్లాలోచేస్తున్నామని చెబుతున్నారుకాని పూర్వంనుంచికృషిచేస్తున్న ప్రాంతం ఎదో, అధికమైన రివెన్యూ వెంటనే ప్రభుత్వానికిచేకూరే ప్రాంతాలేవోకూడాకొంత ఆలోచించాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. ఈవిధంగాచూసి జిల్లావారీగా తీసుకుంటే గుంటూరు, కృష్ణాజిల్లాలలో కొన్నికోట్లు ఖర్చుఅయితే చిత్తూరు, అనంతపురం జిల్లాలకు కొన్నిలక్షలు మాత్రమే ఈస్కీమునకు గాను ప్రభుత్వం మంజూరుచేసినదని వినడానికి చాలా విచారకరంగా ఉన్నది. ప్రతిజిల్లాలో ఉండేపరిస్థితులను అనుసరించి వారి ఆవశ్యకతను అనుసరించి సమానమైన దృష్టితో చూడవలసిందిగా ప్రభుత్వంవారికి మనవి చేస్తున్నాను. పంచాయితీబోర్డులలో ఇతరగ్రామములలో ఉండే వసతులనుగురించిమాస్తే చేయగలిగిన పనులలోకూడా అధికారులు ఇదివరకు మాదిరే వ్యవహరిస్తున్నారు. ఆ విధంగా ఖర్చుచేయడంలో డబ్బుఖర్చుమాత్రమే అవుతోందికాని విధానాల అనుకూలత ప్రజల అందుబాటులోనికి రాలేదని మనవిచేస్తున్నాను. సమానమైన దృష్టితో వెనుకబడిన చిత్తూరుజిల్లా వగైరాలను ముందుకు తేగలుగుతారని ప్రభుత్వానికి మరొక మారు మనవిచేస్తూ విరమిస్తున్నాను.

SRI M. SATYANARAYANA RAJU :—అధ్యక్ష మహాశయా, ఈ అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞత తెలియచేస్తూ రెండుసూచనలు మాత్రం ఇస్తాను. Agricultural schools ప్రత్యేకంగా తీసుకుని అభివృద్ధి చేస్తున్నందుకు కృతజ్ఞత తెలియపరచవలసియున్నది. ఇది చాలా ముఖ్యం. ఇంకా ఎక్కువచేయువలసికూడా ఉన్నది. ఇపుడు ఉన్నవికూడా చాలవు. శ్రీకాకుళం జిల్లాలో వృద్ధిచేయవలసి

యున్నది. మనకు అయిదు intitutions ఉన్నాయి. రమారమి 300 workersకు training ఇవ్వడానికి అవకాశంవున్నది. మనకు కావలసిన 540 మందికోసము 3 training centres పెట్టడానికి ప్రభుత్వం ఆలోచిస్తోంది. దానికి సాధన్య వాదాలు. ఈ విషయములో శ్రీకాకుళంజిల్లాకు ఒకటికూడా లేకపోవడం చాలా విచారకరంగాఉన్నది. వ్యవసాయంలో చాలా వెనుకబడిన జిల్లా. అక్కడ ఒక agricultural school అయినా పెట్టాలని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నాను Civil works విషయం తీసుకుంటే, శ్రీకాకుళంజిల్లా రోడ్లవిషయంలో చాలా వెనుకబడి ఉన్నది. జనాభాబట్టి, area బట్టికూడా వెనుకబడివున్నది. 1932 లో sanction అయినరోడ్లుకూడా అట్లేవున్నాయి. కోమటిపల్లినుంచి మానాపురం సంతనుంచి గర్భంవరకు రోడ్డు sanction అయినది. Land కూడా acquire చేశారు. ఎన్ని సార్లు remind చేసినా ఈ విషయం బడ్జెటులో చేరలేదు. కొన్ని lands ఉచితంగా ఇచ్చారు. కొన్ని గవర్నమెంటువారు డబ్బుఇచ్చి acquire చేశారు. అయిదు సంవత్సరాలుగా గవర్నమెంటువారికి లర్జీలు ఇస్తున్నాము. దానికి ఆలస్యం అవడానికి కారణం ఏమనుకొంటున్నారంటే, జిల్లాబోర్డులకు highways కు ఉండే ద్వంద్వ ఆధిపత్యంవల్ల కొంత ఆలస్యం అవుతోంది. వారిదగ్గరకు వెడితే, వీరిదగ్గరకు వెళ్లమంటారు. వీరిదగ్గరకు వెడితే వారిదగ్గరకు వెళ్లమంటారు. 20 సంవత్సరాలక్రితం sanction అయినరోడ్లున్నాయి. వర్షాకాలంలో ఒక ఊరునుంచి మరొక ఊరు వెళ్ల డానికి కష్టంగా ఉన్నది. ఈ suplementary budget లో ఇవేవీ లేకపోవడం చాలా విచారకరంగా వున్నది.

అదే విధముగా చీపురుపల్లినుండి మెరపమీదుగా ఆదాలగడ్డకు రోడ్డు 1950 సంవత్సరములో Grants-in-Aid క్రింద sanction అయినది. భక్తవత్సలంగారు మంత్రిగా ఉన్నప్పుడు sanction అయినది. ఒక సూపరువైజరునుకూడా వేశారు. మూడు నెలలు పని జరిగింది. సర్వే చేయించినారు కూడా. అయినసూపని ఏమీ జరగ లేదు. ఇప్పుడు supplementary budget లో కూడా ఏమీ దానినిగురించి లేదు. ఇది చాలా వెనుకబడిన ప్రాంతము కాబట్టి అది దృష్టిలో పెట్టుకొని ఈ రోడ్డు పని ప్రారంభించమని కోరుతూ విరమించుచున్నాను.

Sri B. SUBBA RAO :—ఉపాధ్యక్షా, ఈ సప్లిమెంటరీ డిమాండును బలపరుస్తూ కొన్ని సలహాలు ఇస్తున్నాను. రాజమండ్రి తాలూకాలో వ్యవసాయము కేవలము చెఱువు నీటి ఆధారముమీద జరుగుతున్నది. రాజమండ్రి తాలూకాలోని రఘుదేవపురం ఫిర్కా బురుగుపూడి ఫిర్కాలోని సగము గ్రామాలకు ముఖ్యముగా అవసరమైన తొర్రిగడ్డ pumping scheme ను అమలుజరిపినయెడల ఆ ఫిర్కాల లోని గ్రామాలకు ఎంతో ఉపయోగముగా ఉంటుంది అని రైతులు చాలకాలము నుండి ఆందోళన చేస్తున్నారు. కడియం ఫిర్కా గ్రామాలకు అవసరమైన కడియం

ఆవా scheme అమలు జరిపితే కడియం ఫిర్కా రైతులకు చాల ఉపయోగముగా ఉంటుందని అచ్చట రైతులుకూడా చాలాకాలమునుండి కోరడము, ప్రభుత్వ దృష్టికి తీసుకొనిరావడము జరుగుతున్నది. ఇది ఎప్పుడు జరుగుతుందని ఎదురుచూస్తు న్నారు. అయినప్పటికీ ప్రభుత్వంవారు ఏ విధమైన చర్య తీసుకొనలేదు. ఇటు తొర్రిగడ్డవల్ల రెండు ఫిర్కాలకు అటు కడియం ఆవా స్కీమువల్ల కడియము ఫిర్కాకు చాలా వుపయోగముగా యుంటుంది. కాబట్టి వెంటనే ఈ రెండు స్కీములను ప్రభుత్వం అమలు పరుస్తారని ఆశించుచున్నాను.

హరిజనులు, స్వరాజ్యము వచ్చినతరువాత వారికి ఇళ్ల సమస్య తీరుతుందని హరిజనులు ఆశించారు.

MR. Deputy SPEAKER .— సుబ్బారావుగారు దానిపై మాట్లాడండి. సలహాలకు పోతే ఈ పొద్దంతా అవుతున్నది.

SRI B. SUBBA RAO :— హరిజనుల గృహ నిర్మాణము విషయములో ఎక్కువ డబ్బు వెచ్చించి హరిజనుల యిండ్లకొరత తీర్చవలెనని కోరుచున్నాను. National Extension Block లలో హరిజనులు సగము contribution ఇవ్వాలంటే కష్టము. పనులు జరగవు. కాబట్టి వారి విషయములో 1/4 కంట్రిబ్యూషను ఏర్పాటు చెయ్యవలెనని మనవి చేస్తున్నాను.

ఇక నిరుద్యోగ సమస్య తీసుకుందాము. వత్యరకముగా చదివి ఉద్యోగానికి పనికిరాకుండా, పొలు పనికికూడా పనికిరాకుండా ఉన్నారు చాలామంది. అటు వంటివారికి vocational schools ఏర్పాటుచేసి ప్రతి తాలూకాకొక స్కూలు పెట్టి stipends ఇస్తే చాలామందికి ఉపయోగముగా ఉంటుంది.

రాజమండ్రి తాలూకాలో గోకవరంరోడ్డులో వారలంకపల్లి ఏరు ప్రతిసంవత్సరము పొంగిబండ్ల రాకకు ప్రయాణికులకు చాలా యిబ్బంది కలుగచేస్తున్నది. వర్షాకాలము ప్రతినెలలో వారము పదిరోజులు రహదారికి ఇబ్బంది కలుగుతున్నది. ప్రభుత్వంవారు వెంటనే వారలంకవెల్లి దగ్గర బ్రిడ్జి కట్టడానికి estimates తయారుచేసి ప్రజలకు సౌకర్యము కలుగచేస్తారని ఆశించుతూ విరమించు చున్నాను.

SRI N. C. SESHADRI :— ఉపాధ్యక్షా, శ్రీ ముఖ్యమంత్రిగారు ప్రవేశ పెట్టిన సప్లిమెంటరీ బడ్జెట్టును బలపరుస్తున్నాను. అయితే ఈ బడ్జెటు తిరగవేసిచూస్తే రాయదుర్గం తాలూకాలో ఎలక్షనుకు స్కీములగురించి ఏమీ ఖర్చుపెట్టినట్లులేదు రాయదుర్గం తాలూకాలో 8000 ఎకరాలభూమి బావులక్రింద సాగుఅవుతున్నది. ఈ విషయము విద్యుత్ శక్తి మంత్రిగారితో చెప్పాను. Memorandum సమర్పించాను గాని ఏ స్కీము sanction అయినట్లులేదు.

ఇప్పుడు రాయదుర్గం తాలూకాలో భైరవానితిప్ప project నిర్మాణము 1½ కోట్లరూపాయలతో జరుగుచున్నది. 10,000 ఎకరాల భూమిసాగుఅవుతుంది. పైనచెప్పిన 8000 ఎకరాలు సాగుకుతీసుకు రావడానికి ప్రభుత్వంవారు 30, 40 లక్షలు ఖర్చుపెడితే గ్రామాలకు విద్యుత్‌చ్ఛక్తి సరఫరాచేస్తే ప్రతిగ్రామంలోకూడా ఈ well cultivation కు చాలామంది తయారుగా ఉన్నారు. ముఖ్యముగా బావులపైన, lift irrigation మీద ఆధారపడిఉన్నారు. కాబట్టి 15000 బావులకు విద్యుత్‌శ్చక్తి తీసుకొనివస్తే ప్రభుత్వానికికూడా remunerative గా ఉంటుంది. నిరంతరం క్షామప్రాంతమైన రాయదుర్గంతాలూకా ఎంతో బాగుపడు త్తుంది. పోయిన సంవత్సరము మా తాలూకాలో 6 ఇంచీలవర్షం అంతకుముందు 5 ఇంచీలవర్షం కురిసింది. బావులలో నీరు ఉండదు. Bull irrigation కు నీరుతోడుకుని వ్యవసాయము చెయ్యడము చాలా కష్టముగాఉంది. ప్రభుత్వం ఇది గమనించి 1000 బావులకు విద్యుత్‌చ్ఛక్తి తీసుకునేందుకు రైతులు తయారుగా ఉన్నారు. ఈనాడు రాయదుర్గం తాలూకాలో 300 oil engines కు ఒక్కొక్క దానికి 200 రూపాయిలు ఖర్చుఅగుచున్నది. ఇటువంటి పరిస్థితులలో విద్యుత్‌చ్ఛక్తి సప్లయిచేస్తే రైతులకు ఉపయోగకరముగా ఉంటుంది.

రాయదుర్గం తాలూకాలో 26 schoolless centres ఉన్నాయి. ఈ సంవత్సరం schools కు sanction ఇచ్చారు. అనేకగ్రామాలలో విద్యాసౌకర్యములు లేవు. 300 జనసంఖ్య గ్రామాలున్నాయి కొన్ని గ్రామాలలో 200 ఉన్నప్పటికినీ 50 మంది విద్యార్థులు ఉన్నారు. కాబట్టి అటువంటి ప్రాంతాలలో ఈ Restriction పాటించకుండా విద్యార్థులు విద్యను అభ్యసించుటకు కుతూహలంగా ఉన్నచోట్ల స్కూళ్లు పెట్టవలెను. ఉన్న 26 schooles సెంటర్లలో 13 సెంటర్లకైనా స్కూల్సు ఇస్తే బాగుంటుంది.

N. E. S. Blocks వెనుకబడిన ప్రాంతాలలో ముందు స్థాపిస్తామన్నారు. అటువంటివి అనంతపురం, హిందూపురంలో ఉన్నాయి. రాయదుర్గంతాలూకాకు ఒక N. E. S. బ్లాకుకావలెను. ఈ విషయం శ్రీ కళావెంకటరావుగారికి మనవి చేశాను. కంటింజెంసీబట్టి ఇస్తాము, ఎక్కడపడితే అక్కడ ఇవ్వడానికి వీలు లేదు. Cabinet decide చేస్తే నాకు అభ్యంతరం లేదన్నారు. ఈసారి ముఖ్యమంత్రిగారు Cabinet మీటింగులో మాకు 25 N. E. S, Blocks శాంక్షను చేస్తారని ఆశించుచున్నాను.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, మంత్రిగారు supplymentary demands ప్రవేశపెట్టారు. ఇందులో ప్రధానంగా విద్యావిధానాన్ని అభివృద్ధిచేయడానికి, నిరుద్యోగ సమస్యను కొంతవరకైనా తగ్గించడానికనే ఉద్దే

శ్యంతో single teacher school అనేపద్ధతి ప్రవేశపెట్టడం జరుగుతోంది. Single teacher school అనేపేరుతో Krishna జిల్లాలోకూడా కొన్ని schools పెట్టడం జరిగింది. ఒక్కటీచరే ఒకటవ క్లాసునుంచి ఐదవక్లాసువరకూ, ఐదుక్లాసులు manage చేయవలసియుంటుంది. మా జిల్లాలో నేనుకూడా కొన్ని స్కూళ్ళకు స్వయంగా వెళ్ళిచూశాను. కొన్ని కొన్నిచోట్ల 50 మంది, 70 మంది కూడా students ఉన్నారు. ఒక్క teacher అంతమంది పిల్లలను manage చెయ్యడంఅంటే చాలా కష్టం. ఎప్పుడో ఒక సందర్భంలో నేను, ఒక Junior Inspector of Schools కలిసి వెడుతూఉన్నప్పుడు ఆయనకూడా ఇది అసాధ్యమైన విషయమే, కనీసం ఇద్దరు teachers అయినా ఉండాలి అనిచెప్పారు. ఆయన అనుభవంగలవారు కనుక చెప్పగలిగారు. ఏదో schools లేనిచోట schools పెట్టాలనీ, నిరుద్యోగసమస్యను కొంతవరకైనా తగ్గించాలనే ఉద్దేశ్యంతో ఈ schools పెట్టబడినవి. కాని teacher అది manage చెయ్యడం కష్టంఅని ఆయనచెప్పారు. నందిగామ తాలూకాలో కొన్ని కొన్ని చోట్ల వేసవి సెలవలకుముందు single teacher schools ప్రారంభించారు. కాని ఆ teachers ని ఏ కారణంచేతో, అక్కడ నుంచి transfer చెయ్యడంతో తిరిగి ఆ schools కి teachers ని పంపించలేదు. స్కూలు పేరుకు మాత్రం ఉంటుంది కాని అక్కడ teachers లేకుండానే జరిగి పోతోంది. ఇటువంటిది జరగనివ్వకుండా ఈ single teachers కాకుండా, కనీసం ఇద్దరు teachers నైనా వేయవలసిన అవసరం ఉంది. ఇంకో విషయం కూడా చెప్పవలసిన అవసరం ఉంది. కృష్ణా జిల్లాలో schools reopen చేసిన తరువాత, మూడు నెలలవరకూ High Schools లో text books రాలేదు. దీనికి బాధ్యత ఎవరిది. జిల్లా కలక్టరుదా ? లేక District Board P.A. దా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇంటికి పోయారు.

SRI V. VISWESWARA RAO :—ఇంటికి ఎందుకు పోవలసిన వచ్చింది. Text Book Committee ఉంది. సకాలంలో సరియైన నిర్ణయం తీసుకొని పుస్తకాలు select చేసి ఉంటే ఇంటికి పోవలసిన అవసరంలేదు. ఒక వేళ Text Book Committee ఒక నిర్ణయం తీసుకొని దాన్ని అమలు జరపడానికి పూనుకొని ఉంటే Collector దాన్ని withdraw చేయుటకు ప్రయత్నం చేయవలసినటువంటి అవసరంలేదు.

THE HON. SRI B. GOPALA REDDI :—Corruption.

SRI V. VISWESWARAYYA :—Corruption ఉందని మంత్రిగారు ఒప్పుకుంటున్నారు.

MR. DEPUTY SPEAKER :—Text books, supplementary demands లో లేవు కనుక దాని విషయం చెప్పనవసరంలేదు.

SRI V. VISWESWARA RAO :—District Boards గ్రాంటు ఇచ్చే విషయం ఉంది కాబట్టి District Board Manage చేసే High Schools కాబట్టి వాటివిషయం చెప్పవలసి వచ్చింది. నేనుకోరేదేమిటంటే దీనికి బాధ్యులెవరని విచారించి, దీనిలో corruption ఏమైనా జరిగియుంటే దానికి బాధ్యులైన వారిమీద వెంటనే చర్యతీసుకోవలసిన అవసరం ఉంది. దీనియొక్క ఫలితం కృష్ణా జిల్లాలో విద్యార్థుల జీవితం ఎంత నాశనమయినదో కూడా ఆలోచించండి. మంత్రి గారికి, ఈ విషయం బాగా తెలుసును. High Schools విద్యార్థుల జీవితం చాలా దుర్భరంగా ఉంది. ఇంతవరకూ 9 నెలలు మాత్రమే జీతం కడుతూ ఉండేవారు. ఇప్పుడు 10 నెలలు కట్టమన్నారు. ఒకటవఫారం నుంచి మూడవ ఫారంవరకూ ఇదివరకు 2-10-0 కడుతూ ఉండేదాన్ని మూడు రూపాయలు చేశారు. తరువాత 3-4-0 చేశారు. నాలుగవఫారం నుంచి ఆరవఫారంవరకూ 5-4-0 ఉండేది, దాన్ని 6-0-0 చేశారు. ఈ సంవత్సరం 6-8-0 కూడా చేశారు. ఈవిధంగా పెంచడం జరిగింది.

THE HON. SRI B. GOPALA REDDI:—కలకత్తాలో 12 నెలలూ కడతారు.

SRI V. VISWESWARA RAO :—కడితే కడుతూ ఉండవచ్చు. కలకత్తాలో విద్యావిధాన standards, మనకు ఉండేటటువంటి standards కు వ్యత్యాసంకూడా చూడాలి.

MR. DEPUTY SPEAKER :—6-8-0 కాదు. ఆరుంపావలా చేశారు.

SRI V. VISWESWARA RAO :—ఇల్లా జీతాలు పెంచడంవల్ల బీద ప్రజలు తమ పిల్లలకు చదువు చెప్పించే అవకాశంలేకుండా పోతోంది. అనేకమంది తమపిల్లలను ఈ సంవత్సరం స్కూళ్ళు మానిపించడంకూడా జరిగింది. ఇటువంటి స్థితి ఏర్పడకుండా జిల్లా Board లకు ప్రభుత్వం grant ఇస్తోంది. ఈ సంవత్సరం ఇప్పటికప్పుడే రెండుకోట్లవరకూ పన్నులు వేయడంకూడా జరిగింది. ఒక ప్రక్క ప్రజానీకంమీద విపరీతంగా పన్నులు వేస్తూ విద్యార్థుల జీతాలు పెంచడం సమంజసంగాలేదని మనవిచేస్తున్నాను. ఇంక Co-operative సొసైటీల విషయం చెబుతూ ఒక ప్రధానమైన ఒక విషయం చెప్పారు. కర్నూలుకు, గుంటూరుకు మాత్రం ప్రత్యేకించి Extensive Milk Supply Scheme ప్రవేశపెడుతున్నామన్నారు.

ఈ రెండు పట్టణాల ప్రజల అవసరాల దృష్ట్యా ఈ extensive milk supply scheme ఏర్పాటు చెయ్యడం బాగానే ఉంది. కాని ఆంధ్రదేశంలో విశాఖపట్టణం, బెజవాడకూడా చాలా పెద్ద పట్టణాలు. ఈ రెండు పెద్ద పట్టణాలకూకూడా ఈ extensive milk supply scheme ను extend చేయవలసిన అవసరం ఉంది. ఇంక civil works విషయంలో చెప్పవలసి వచ్చినప్పుడు మన ఆంధ్ర దేశంలో ఉన్నటువంటి road rollers తారు కరిగించేటటువంటివి Cement Mixers ఇవన్నీ చాలా అధ్వాన్న స్థితిలో ఉన్నాయి. ఏ చిన్న చిన్న మరమ్మతులు వచ్చినప్పటికీ యివి మూలపడిపోతున్నాయని ప్రభుత్వానికికూడా తెలుసును. ఇవన్నీ కూడా తమ జీవితానికి మించి పనిచేశాయని ప్రభుత్వమే అంగీకరిస్తోంది. వాటిని replace చెయ్యకపోవడం చాలా అన్యాయం. మదరాసు రాష్ట్రంనుంచి ఆంధ్ర రాష్ట్రం విడిపోయినప్పుడు మనకన్యాయం జరిగిందని ఆ department లో అనుభవం ఉన్నవాళ్ళంతా చెబుతున్నారు. జరిగిన అన్యాయంమాటా ఎల్లా ఉన్నప్పటికీ ఈ వయస్సు మళ్ళిన road roller లు వగైరాలను మరమ్మతు చేయించడానికి కావలసిన workshop ఇదివరకు రాజమండ్రీలో పెట్టాలని ప్రయత్నంచేసి అది పూర్తికాకుండా బెజవాడలో పెట్టాలని ప్రయత్నం చేస్తున్నారు. కాబట్టి ఆపని వెంటనే పూర్తిచేసి మనం ముందు planning లో ఎన్నో scheme లు తలపెడుతున్నాం కనుక, వాటి కన్నింటికీ ఈ road rollers, cement mixers సక్రమంగా పనిచేస్తేనే పనులు చురుగ్గా జరుగుతాయి కనుక, ఆ విషయమై శ్రద్ధ వహించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇంక electricity దూర ప్రాంతాలకు తీసుకుపోతున్నారు గాని, మధ్యనున్నటువంటి గ్రామాలకు ప్రయోజనంలేకుండా పోతోంది. ఆ గ్రామాలకు electricity సప్లయి చెయ్యడానికి, second lines మాత్రం వేస్తే చాలును గనుక, ఆపని కొద్ది పెట్టుబడితో చెయ్యడానికి వీలుంది కాబట్టి అదికూడా చెయ్యాలని కోరుతున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI:—ఉపాధ్యక్షా! ఈ supplymentary demands విషయంలో అట్టే ఎక్కువ విమర్శన లేనందుకు చాలా సంతోషం. గౌరవనీయులైన సభ్యులంతా ఈ supplementary demands కు సంబంధించని విషయాలు కాకుండా వాళ్ళవాళ్ళ నియోజకవర్గాలలో జరగవలసిన విషయాలు ఎక్కువగా చెప్పారు. సాధ్యమైనంతవరకూ ఇక్కడ ఉల్లేఖింపబడిన విషయాలను గురించే చర్చించమని తమరు మొదటే ఒక ruling ఇచ్చినారు. శ్రీ సత్యనారాయణరాజుగారు Community Project లు, National Extension Schemes వగైరాలలో ఉద్యోగస్థులుండడానికి కట్టిన బిల్డింగులకు 30 లక్షల రూపాయిలు ఖర్చు పెట్టారని విమర్శించారు. Electricity దూరప్రాంతాలకు తీసుకుపోతున్నారేగాని, చుట్టుప్రక్కల ప్రాంతాలకు ఇవ్వడంలేదని విశ్వేశ్వరరావుగారు;

Sri B. Gopala Reddi] [30th September 1955

వెంకటేశ్వర్లుగారు, ఇంకా ఇతర మిత్రులూకూడా చెప్పారు. ఈ విషయమై intensive development చెయ్యాలా లేక extensive గా అన్నితాలూకాలకు కొంతకొంత electricity ఇవ్వవలెనా అనే విషయంకూడా మనం గమనించవలసిన అవసరం వున్నది. ఈ విషయంలో ఇప్పటికే విద్యుచ్ఛక్తి శాఖవారు ప్రతి సంవత్సరం చాలా ఎక్కువ ఖర్చు పెడుతున్నారు. పోయిన సంవత్సరం electricity scheme నిమిత్తం దాదాపు 7 కోట్లరూపాయలు ఖర్చయింది. ఇది అందరికీ ఆశ్చర్యంగా ఉంది. ఇంత నిజంగా ఖర్చుపెట్టారా . అని దర్యాప్తుకూడా చేసినారు. ఈ ధనం కేవలం stores pile up చేసి పెట్టడానికి గాక, విద్యుచ్ఛక్తి సరఫరా విస్తరణకు ఖర్చుపెట్టినారనే విషయమే తేలింది. Electrictiy Department అట్లా ఉత్సాహంగా పనిచేస్తున్నందుకు చాలా సంతోషం. ఈ విషయంలో నేను చెప్పినట్లు intensive development కావలెనా, లేక extensive development చెయవలెనా అనే విషయం మనం ఆలోచించుకోవలసి యుంటుంది. Electricity ఈ నాడు అన్ని గ్రామాలవారు కోరుతున్నారు. ప్రజలందరు చాలా ఉత్తేజంగా, ఉత్సాహంగా electricity కావాలని కోరడంకూడా చాలా సంతోషకరమైన విషయం. ఈ rural electrification చురుగ్గా చేయించడానికి ప్రభుత్వంవారు పూనుకొంటున్నారు. సాధ్యమైనంత త్వరలో ఇతర ప్రాంతాలకు కూడా electricity తీసుకువెళ్ళడానికి ప్రయత్నం చేస్తున్నారు.

శ్రీ విశ్వేశ్వరరావుగారు ఇంకొక విషయం చెప్పారు. single teacher schools పెట్టినందుకు సంతోషం వెలిబుచ్చినారు. ఆ schools లో ఎక్కువమంది విద్యార్థు లున్నప్పుడు single teachers ఉండవలెనా లేకపోతే రెండవ ఉపాధ్యాయునికూడా వెయ్యటానికి వీలున్నదా అనే విషయం చూడాలని వారు కోరారు. ఆ విషయంకూడా తప్పకుండా పరిశీలించి—strength ఎక్కువగా ఉన్నప్పుడు రెండవ teacher ని వెయ్యటానికి బహుశః ఏమీ ఆక్షేపణ ఉండదనుకుంటాను. ఆ విషయం నేను తప్పకుండా చూచి అవసరమైనచోట్ల రెండవ ఉపాధ్యాయునికూడా వేయడానికి ప్రయత్నం చేస్తాం.

వచ్చే ఐదు సంవత్సరాలలో National Extension Schemes ను అన్ని తాలూకాలకు, ప్రతీగ్రామానికే extend చెయ్యాలని మనం అనుకొంటూయున్నప్పుడు, village-level workers ను తర్ఫీదుచేయవలసి యుంటుంది.

ఇందుకోసం, బాపట్ల, నంద్యాల, సామర్లకోట వగైరా ప్రదేశాలలో స్కూళ్లు ఏర్పాటుచేసి కొన్నివందల village level workers ను తర్ఫీదు ఈయము జరుగుతున్నది. ఈ National Extension Scheme దీర్ఘకాలము వుండేది కాబట్టి,

యీ స్కూళ్లనునడపటానికి కొంతమంది ఉద్యోగస్థులు అవసరము కాబట్టి, వారందరు వుండడానికి కొన్ని buildings కట్టించడము అవసరముగా కనబడుతున్నది. ఇందుకు గాను 24 లక్షలు ఒకచోట, ఆరులక్షలు మరొకచోట, మొత్తము ముప్పదిలక్షల రూపాయలు ఖర్చుచేసి వారికి గృహావసతివగైరాలు ఏర్పాట్లు చేయడము న్యాయమేమోనని అనుకుంటున్నాను. ఈ స్కూల్సు గ్రామాలకు కొంతదూరములో ఏర్పాటుచేస్తున్నప్పుడు, వారందరిని బాడుగ యిళ్లలో వుండమని చెప్పేదానికన్న, వారికి గృహావసతి ఏర్పాటుచేయటానికి కొంత డబ్బు ఖర్చుచేయడము న్యాయమని అనుకుంటున్నాను. ఎక్కడైనా, ఏ విషయంలోనైనా కొంతవరకు డబ్బు దుబారా అవుతున్నదని సత్యనారాయణగారు చెబుతున్నప్పుడు, ఆ విషయములో ప్రభుత్వము దర్యాప్తుచేయుడానికి ఆక్షేపణ వుండదు. కాని యీ చిన్న చిన్న ఉద్యోగస్థులకోసం, యీ training schools ఏర్పాటుచేసిన ప్రదేశాలలో, కొంతమందికైనా వారికి గృహావసతి కలుగజేయుడము అవసరమేమో ననిపిస్తున్నది.

గౌరవసభ్యులు చాలామంది వారివారి నియోజకవర్గాలలో వారివారి తాలూకాలలో జరగవలసిన రోడ్లువగైరా విషయాలను గురించి చాలామటుకు చెప్పారు. కాని అది చాలా పెద్దసమస్యగా వున్నది. ఏమైనప్పటికినీ, ప్రభుత్వానికి ధనాభావము వున్నదన్నసంగతి వారందరికి చెప్పవలసి వున్నది. పోయిన సంవత్సరం నేను అనుకున్నదానికన్నా, బడ్జటులో చెప్పినదానికన్నాగూడా, ఎక్కువగా deficit వచ్చింది. పోయిన సంవత్సరం 5 కోట్ల 25 లక్షల రూపాయలు deficit వచ్చింది. Revised estimates ను గురించి ఆలోచించినప్పుడు 4½ కోట్లే deficit వుంటుందని నేను అనుకున్నానుగాని. Accountant General నుంచి వచ్చిన లెక్కలను బట్టిచూస్తే 1954-55 సంవత్సరం 5 కోట్ల 25 లక్షలు ఆంధ్రరాష్ట్రానికి deficit వున్నట్లు తేలింది. ఇది చాలా serious matter అని గుర్తించాలి. Elections కు గాను ఖర్చుపెట్టిన ముప్పైలక్షలుగూడా బహుశః యీ మొత్తములో చేరివుంటే వుండవచ్చును. దానికి తగినట్లుగా మనకు Inter-State sales tax గూడా పోతున్నది. గౌరవ సభ్యులు వారియొక్క తాలూకాలలోనూ, నియోజక వర్గాలలోను కావలసినపనులు కోరుతున్నప్పటికిని, యీ విషయముగూడా వారందరు తీవ్రంగా ఆలోచించవలసి వుంటుందని అనుకుంటున్నాను. ఇప్పుడు ఏదో రెండుకోట్లు రూపాయల అదనపు ఆదాయము రావడానికి బిల్లులు ప్యాసు చేశామని అంటున్నారు. ఇంకా pass కాలేదు. ఒక్క mill cloth విషయములో మాత్రమే ప్యాసు అయినది. ఇంకా యితర బిల్లు ఎక్కడ ప్యాసు అయినది? రెండుకోట్లు రూపాయిలు additional taxation వేశారని విశ్వేశ్వరరావుగారు అంటున్నారు. కాని యిది నిజము కాదు.

Sri V. VISWESWARA RAO :—బిల్లులు pass చేస్తున్నారే !

THE HON. SRI B. GOPALA REDDI :—ఇంకా pass చేయలేదే.

SRI V. VISWESWARA RAO :—Pass అయిపోతున్నవే.

THE HON. SRI B. GOPALA REDDI :—ఇంకా pass లేదే. చెయ్యండి, ఇంకా చెయ్యండి, అనిగదా నేను కోరేది. అది తొందరగా శాంక్షను చేస్తే చాలా సంతోషమే నే! ఇంకా దీనికి ఎటువంటి ఆక్షేపణ లేకుండా చేయవద్దనే గదా నేను కోరేది. ఇదికాకుండా, పోయిన సంవత్సరముకూడా యింత le icit వచ్చింది, దానిని పూర్తిచేసుకోవలసిన అవసరమున్నది, లేకపోతే మనకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో జరగవలసిన పనులకు ఆటంకము ఏర్పడే అపాయమువుంటుందేమో నని అనుకోవలసి వుంటుంది. ఈ విషయాలన్నీ నేను సభ్యులందరికి తరువాత కావాలంటే చెబుతాను. ఇంకా యీ విషయములో చురుకుగా పనిచేయలేదేమోనని అనిపిస్తున్నది. గౌరవసభ్యులు చేసినసూచనలన్నీ తప్పకుండా ప్రభుత్వము గమనిస్తుంది. ఇంకను యీ డిమాండ్లమీద cut motions కూడా వచ్చివున్నవి. వాటి అన్నిటి విషయములోనూ విపులముగా చర్చ మూడవతేదీన జరుగుతుంది కాబట్టి ఇప్పుడు నేను విపులంగా చెప్పవలసిన అవసరమేమీ లేదని అనుకుంటున్నాను. కనుక సభ్యులందరికి నేను నా వందనములర్పిస్తున్నాను.

Mr. DEPUTY SPEAKER :—సభ మధ్యాహ్నము 2-30 గంటలకు వాయిదా వేస్తున్నాను.

The House then rose for lunch.

AFTER LUNCH—2-30 P.M.

## IV. GOVERNMENT BILL.

### *The Madras Proprietary Estates' Village Service and Hereditary Village Offices (Andhra Amendment) Bill, 1955.*

### (*L. A. Bill No.* 1 *of* 1955).

**THE HON. SRI B. GOPALA REDDI:—Sir, under Rule 22 (3) of the Assembly Rules I move that the Madras Proprietary Estates' Village Service and Hereditary Village Offices (Andhra Amendment) Bill, 1955 be passed over and the House go on with the other items in the agenda. Government would like**

to reconsider the Bill in the light of discussions that have taken place so far and bring it in an amended form later on in this sitting or in the next sitting.

SRI PILLALAMARRI VENKATESWARLU :—నా amendment ఉన్నది.

THE HON. SRI B. GOPALA REDDI :—My motion is only that the Bill be dropped.

SRI PILLALAMARRI VENKATESWARLU :—My amendment is that the Bill be dropped. Is not my amendment admissible ? I think I am in order.

MR. SPEAKER : No such amendment is admissible.

SRI PILLALAMARRI VENKATESWARLU :—When there is a motion, am I not entitled to give an amendment ?

MR. SPEAKER : That is an adjournment motion. The parliamentary procedure is to adjourn it indefinitely.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Then I will move it now on your advice.

THE HON. SRI B. GOPALA REDDI :—It is just now adjourned *sine-die*.

MR. SPEAKER: It will be adjourned అంటే చాలునంటే. The Government will give such a motion............

Sri P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ motion ను నేను వ్యతిరేకిస్తున్నాను. దీనికి సవరణ ఉండవచ్చునాలేదా అనే విషయము తరువాత చూచుకోవచ్చునుగాని, ఈ motion ను నేను వ్యతిరేకిస్తున్నాను. I want to make a statement on this. ఈబిల్లు గత సమావేశములో చర్చించాము. అప్పుడు దీనిమీద general discussion పూర్తి అయింది. ఈ బిల్లు సరియైనది కాదు, చిన్న ఉద్యోగస్తులమీద, గ్రామోద్యోగస్తులమీద అనవసరమైన చర్యతీసుకోవడానికి ఆస్కారము ఇస్తుందని అప్పుడు వ్యతిరేకించాము. కాని అప్పుడు గవర్నమెంటు దాన్ని అంగీకరించలేదు. దాన్ని సాగించాలనే అనుకొన్నది. ఆచర్చ అయినతరువాత ఈరోజు క్లాజువారి చర్చ ప్రారంభించాము. క్లాజువారి చర్చ జరుగుతున్న ధానికి అనేక సవరణలు వచ్చినాయి. ఇది చిన్న బిల్లు అని మొట్టమొదట చెప్పారు.

Sri F. Sundarayya] [30th September 1955

ఇది కాదు, దీనికి చాలా ప్రాముఖ్యత ఉన్నదని అనేక సవరణలు వచ్చినప్పుడు, ఆ సవరణలను గురించి తమ అభిప్రాయాన్ని కూడా వ్యతిరేకిస్తూనే ప్రభుత్వపక్షమువారు చాలామంది మాట్లాడారు. కొంతమంది, ప్రభుత్వపక్షమువారే ఈబిల్లే పనికిరాదని చెప్పారు. ప్రభుత్వము దానివిషయం ఆలోచించకుండా ఉన్నది. క్లాజువారి చర్చ జరుగుతూ ఉన్నపుడు, ఆఖరున ఈ సమస్యను వాయిదా వేసేటప్పుడు మేము మాట్లాడవలసి యున్నది అన్నతరువాత మంత్రిగారు సమాధానం ఇస్తారని అన్నారు. కాని వారుఇచ్చే సమాధానంలో నా సవరణగురించిలేదు. అభిప్రాయమేమిటో చెప్పకుండా ఉన్నారు. ఇప్పుడు అనేక సవరణలు పెట్టాము. ఈ సవరణలు మంచివను కొంటున్నారో మరేమి అనుకొంటున్నారో చెప్పడంలేదు.

THE HON. SRI B. GOPALA REDDI :—కొన్నికొన్ని మంచివి ఉండవచ్చు.

SRI F. SUNDARAYYA :—కొందరు ఇవి మంచివి అంటున్నారు, కొందరు ఇవి మంచివిగా ఉండవచ్చు అని అంటున్నారు. అసలు ప్రభుత్వంయొక్క ఉద్దేశం ఏమిటి ? ఈవిధంగా దీంట్లో పొరబాటున్నది, కొన్నింటినినైన చర్యతీసుకొంటాము, కొన్నటిపైన తీసుకోలేము లేక ఇవి ఆలోచిస్తున్నాము అనేది చెప్పకుంటే, ప్రస్తుతము దీనిని తీసుకురాదలచుకోలేదు, ఎప్పుడో ముమ్ముందు మా ఇష్టం వచ్చినప్పుడు, మా ఇష్టం వచ్చినరీతిగా తెస్తాము అని చెప్పడం, చాలా అసాధారణ పరిస్థితిని ప్రభుత్వం కలుగజేస్తుందని చెప్పవలసియున్నది. ఇదేదో తొందరపాటుతో జరిగిందికాదు. నాలుగునెలలనుంచి ఇది చర్చలో ఉంటున్నది. ప్రభుత్వము దీనిని గురించి ఆలోచించడానికి ఈ నాలుగునెలలు time ఉండినది. అటువంటప్పుడు దీన్ని సమగ్రంగా ఆలోచించి ఇదిగో దీన్ని ఈ విధంగా మార్చబోతున్నాము. మా ఉద్దేశమిది. ఈబిల్లును ఈరీతిగా సవరించడానికి మాకు కొంత time కావాలి అనే దేమి చెప్పకుంటే ఈ చర్చను దృష్టిలోపెట్టుకొని మేము ఇంకోబిల్లు తెస్తామని చెప్పడం అంటె ఈ శాసనసభచర్చకు తగినంత గౌరవం ఇవ్వడంలేదనే చెప్పవలసి యున్నది. అందుచేత ఈ బిల్లు పొరబాటు బిల్లుఅని మేము అనుకొంటున్నాము.

THE HON. SRI B. GOPALA REDDI :—అంటే చెంపలు వేసుకొమ్మంటారా?

SRI P. SUNDARAYYA :—ఏ బిల్లయినా ఇది పొరబాటు అని చెప్పడానికి హక్కు ఉన్నది. విచారణలేకుండానే గ్రామోద్యోగస్థులను suspend చేసేటటువంటి అధికారం ఈబిల్లు కలుగజేస్తున్నది. అందువల్ల ఇది పొరబాటుబిల్లు

అన్నప్పుడు, దానికి చెంపలువేసుకోవలసిన అవసరంలేదు. ఇదిగో ఈబిల్లులో ఈ మార్పులు చేయదలచుకొన్నాము. ఇవి చెయ్యదలచుకోలేదు. ఈగ్రామోద్యోగస్థుల గురించి సమగ్రమైన బిల్లు తెస్తాము అని చెప్పివుంటే, ఎవరికి ఏమి అభ్యంతరం లేదు. అదేమి చెప్పకుండా దాన్ని ఏ రూపములో తెస్తారో చెప్పకుండా, దీన్ని చర్చించడము, వాయిదావేయవలసిందని చెప్పడం సరియైనది కాదు. కనుక మీ policy, మీ ఉద్దేశం ఏదో definite గా చెప్పమంటున్నాను. అంతకంటె నేను కోరేది ఏమిలేదు.

దానిమీద మీదృక్పథము చెప్పండి. అంటే, యీ బిల్లులో యీ యీ మార్పులు చేయదలచుకున్నాము, యీయీ మార్పులు చేయదలచలేదు, యిందులో ఏదో ఒకటి చేస్తాము అనేది యేదీకూడా చెప్పకుండా, మేము యీ బిల్లును యిప్పుడు చర్చించడములేదు, గనుక దీనికి ప్రస్తుతము వాయిదా ఇవ్వండి అని చెప్పటం సరియైన పద్ధతి కాదు. మీరు ఆ విధంగా కారణములు వివరించకుండా వాయిదాయివ్వండి అని అడుగుతున్నారు గనుక మేము దీనికి వ్యతిరేకిస్తున్నాము. ప్రభుత్వముయొక్క policy యేమిటో decided గా చెప్పండి. చెప్పితే మేము దాన్ని అనుసరించి పోతాముగదా! అంతకన్న మేము మిమ్ములను కోరేది యేమీలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, ఇప్పుడు యీ stage లో యీ విధంగా తీసుకొని రావడమంటే, యీ బిల్లును pass over చేయండి అని మంత్రిగారు అంటూంటే, యీ బిల్లును యిలాగే ఉంచి యింకొకరోజుకు postpone చేయాలనే అర్థముతప్ప మరేమికనబడదు. అందుకనే మేము దీన్ని క్రిందటి session లో చర్చించి, దీన్ని యింతదూరము తీసుకొనివచ్చిన తరువాత యిప్పుడు కారణములు చెప్పకుండా వాయిదా కావాలనడం సరియైన పద్ధతి కాదు. (Interruption: that is not our view point). ఈ బిల్లులో ప్రభుత్వము యింకా కొన్నిమార్పులు తీసుకొనిరావటానికి వాయిదాఅడిగితే, ప్రభుత్వము వేరే ఒక సమగ్రమైన బిల్లును తీసుకొని రావటానికి అవకాశము యివ్వడమే మా ఉద్దేశ్యము. కాని యీ బిల్లులోనే యింకాకొన్ని amendments తీసుకొని రాదలిస్తే, దీన్ని యింకా కొంచెము confusion లో పెట్టడమే నన్నమాట. అట్లా చేసేదానికంటే వేరేబిల్లును తీసుకొని రావటానికి provision ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వానికి చెబుతున్నాను.

THE HON. Sri B. GOPALA REDDI :—అధ్యక్షా, ఈ బిల్లుమీద ఇదివరకే విపులంగా చర్చ జరిగింది. కొన్నిసవరణలు వచ్చాయి. ఆ సవరణలమీద తగినంత పరిశీలనచేసి వాటి మంచిచెడ్డలను తెలుసుకొనడానికి మాకు యింకా కొంత

Sri B. Gopala Reddi] [30th September 1955

టైము కావాలని అడగడములో తప్పేమీలేదు. ఆ విధంగా కాకుండా అట్లాకాదు, ఇప్పుడే దీనిమీద చర్చ పూర్తిచేయాల్సిందే, అని అంటే, యిప్పుడు యీ బిల్లువున్నది ఉన్నప్రకారంగానే, pass చేయవలసి వస్తుంది. అలా చేయడము న్యాయముకాదు అనే ఉద్దేశ్యముతోనే మేము యిప్పుడు దీనికి కొంతకాలం వాయిదా యివ్వవలసిందిగా కోరుతున్నాము. సవరణలు కొన్నివచ్చాయి. ఆ సవరణలు అంగీకరించాలో, లేదో, లేకపోతే ఈ బిల్లును కొంతమటుకు పునరాలోచించటానికి వీలుగా, కాల వ్యవధి కావాలి అంటున్నప్పుడు దాన్ని ప్రతిపక్షంవారు వ్యతిరేకించడము న్యాయము కాదు, సరియైనవాదన కాదు. వారు ఆ విధంగా ఎందుకు వ్యతిరేకిస్తున్నారో నాకు అర్థము కావడములేదు. పునరాలోచన చేయటానికే మేము opposition పార్టీ వారినిగాని యితర పార్టీలవారినిగాని, వారుచెప్పిన సలహాలను దృష్టిలో పెట్టుకొని వాయిదా యివ్వమని కోరుతున్నామేగాని, వేరుకాదు. అందువల్ల యీ బిల్లు యీ session లో పూర్తి కాకపోవచ్చు. వచ్చే session లోనైనా opposition పార్టీ వారు చెప్పినవి కొన్ని amendments మేము ఒప్పుకుంటామని మేముచెప్పవచ్చును. దానినైనా ఆలోచించడానికి మేము కాలవ్యవధి కావాలని అంటున్నప్పుడు వారు వ్యతిరేకించడము భావ్యముకాదు. ఇంకను వారు ఆక్షేపణచేసే కొన్ని clauses ను మేము ఒప్పుకుని తీసివేయవచ్చు. అంతేకాని, ఇప్పుడే యిదమిద్ధంగా, ఫలానా clauses మేము అంగీకరిస్తున్నాము, ఫలానా clauses అంగీకరించడములేదు అని యిప్పటికిప్పుడే చెప్పమనిఅంటే దానికి వీలులేకుండావుంది. కాబట్టి యీ విషయాలన్నీగూడ మేము consider చేయటానికి వ్యవధిలేదు. అందుకు వాయిదా కావాలని అంటున్నాము. కాబట్టి దయచేసి వాయిదా యివ్వమని కోరుతున్నాను.

Mr. SPEAKER: Under Rule 22 (3) of the Assembly Rules the order of business of the House shall not be revised except on a motion for the same accepted by the House.

The question is:

"That the Madras Proprietary Estates' Village Service and Hereditary Village Offices (Andhra Amendment) Bill, 1955 be passed over."

The motion was carried.

[30th September 1955

THE HON. SRI K. CHANDRAMOULI :—Number of pawn brokers ఎంతో నేను చెప్పలేను. Pawnbrokers ,rules కావాలంటే Act ఉన్నది. చూడండి.

MR. SPEAKER : There is a punishment provided by way of fine of Rs. 500. I put the motion before the House. The question before the House is :—

" that the words 'Revenue Inspector' be substituted for the words , Deputy Tahsildar '.

The amendment was lost.

Clause 2 was put and carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

THE HON. SRI K. CHANDRAMOULI :—I move, Sir, that the Madras Pawnbrokers (Andhra Amendment) Bill, 1955 be passed into Law.

MR. SPEAKER : Motion moved :

'That the Madras Pawnbrokers (Andhra Amendment) Bill, 1955 be passed into law.'

SRI V. VISWESWARA RAO:—అధ్యక్షా, మామిత్రుడు వేమయ్యగారు ఒక సవరణ తెచ్చారు. అయితే ప్రభుత్వపక్షంవారు అంగీకరించలేదు. ఈబిల్లు శాసనము కాబోతున్నది. కాని చాలామంది మిత్రులు అసలు ఇటువంటి బ్యాంకులు ఉన్నాయా అని సందేహపడుతూ ఉన్నారంటే నేను ఆశ్చర్యపడవలసియున్నది. మిత్రుడు నాగిరెడ్డిగాని వేమయ్యగారుగాని ఆంధ్రదేశంలో ఇటువంటి బ్యాంకులు ఉన్నవి అనిచెప్పినపుడు చాలమంది ఆశ్చర్యపడ్డారు. ఈరోజుకూడ మా జిల్లాలో 'గిరిగిరి' బ్యాంకు అనిఉన్నది. Chit fund banks ఉన్నాయి. ప్రజలను రోజుకు, నెలకు, 100, 50 పాతిక రూపాయలవరకు వడ్డీ తీసుకునే తవకా బాంకులు ఉన్నాయి. వాటిని అరికట్టుటకు పోలీసులకు అధికారం ఉందని, Sub-Inspector కు Head Constableకుఉందని చెప్పేసి, ఇపుడు మనం క్రొత్తగా Tahsidar, Deputy Tahsildar వరకుకూడ అధికారం ఇస్తున్నామంటే, అటువంటి వాటిపై తనిఖీ ఆజమాయిషీ చేయడంగాని ఒక కట్టు దిట్టంలో పెట్టడం జరుగుతుందా అంటే జరగటం లేదనే చెప్పవలసియున్నది. ఇటువంటివి అనేకం బాహాటంగా జరుగుతున్నవి. గిరిగిరి

బాంకు ప్రతివారికి తెలుసు. జగ్గయ్యపేటలో బాహాటంగా జరుగుతున్నది. ఏరోజు రూపాయలు ఇవ్వకపోతే, ఆరోజే అనేక రూపాయలలో వాండ్లకు నిర్బంధం కలుగుతున్నది. అక్కడ పోలీసు స్టేషన్ ఉంది. S. I. ఉన్నాడు. బహుశః Circle Inspector లేడు అనుకుంటాను. Headquarters Tahsildar ఉన్నారు. అటువంటి పట్టణంలో జరుగుతూ ఉంటే, పల్లెటూరు విషయం చెప్పనక్కరలేదు. ఇట్లాంటి బాంకులు బెజవాడలో మూలమూలలో ఉన్నవి. ఇన్ని జరుగుతూవున్నప్పటికిన్నీ కూడ వాటిని అరికట్టడానికిగాని, వాండ్లపై చర్య తీసుకొనటానికిగాని, ఇంతవరకు ఏమి జరుగలేదని గత రిపోర్టువల్ల మనకు తెలుస్తున్నది. ఏమైనా ఈ Act వస్తుంది కాబట్టి ఇకనైనా సరే, ఈ Act చక్కగా అమలు జరుపుతారని, దానిని కట్టుదిట్టముగా జరిపి, విపరీత వడ్డీ వ్యాపారులను అరికట్టవలెనని మనవిచేస్తున్నాను.

MR. SPEAKER : The question before the House is : —

'That the Madras Pawnbrokers (Andhra Amendment) Bill 1955, be passed into Law.'

The motion was carried and the Bill was passed into law.

2. *The Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill,* 1955.

THE HON. SRI K. CHANDRAMOULI :—Sir, I move that the Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill, 1955 be taken into consideration.

ఈ బిల్లులో ఒకటి రెండు కొత్త క్లాజులు చేర్చబడ్డాయి. 76 వ క్లాజులోని wording లో భేదము లేకపోయినా, ఉన్న legal complications వల్ల మళ్ళీ దానిని పూర్తిగా తీసుకొనిరావలసిన అవసరంవచ్చి ఆ క్లాజునుగూడా ఈ బిల్లులో చేర్చాము. దేవాలయాల ఆదాయంమీద 5% levy వేయటంఅనేది Tax క్రింద భావించబడి, High Court లోను, Supreme Court లోను కూడా decisions ఇచ్చారు. అందువల్ల 1954-55 వ సంవత్సరంలో Andhra Province form అయిన తరువాత ఒక సవరణచేయబడింది. అయితే 1361, 1362, 1363 ఫసలీలలో High Court Supreme Courtలలో వ్యవహారం జరుగుతూ ఉండడంవల్ల అప్పుడు రావలసిన contributions వసూలు చేసుకోడానికి అవకాశం లేకపోయింది. ఈ

enactment చేసిన తరువాత కొంత contribution ఇచ్చికంగా వసూలు అయింది. ఎక్కువగా ఈ Fund కొరకు వాండ్లను ఒత్తిడిచేయకుండా, మీరు ఇవ్వవలసినది, లేకపోతే పరిపాలన జరుగదు, ఇది మామూలుగ గవర్మెంటు వసూలుచేసి Establishment కు కావలసిన డబ్బుఅంతా కూడా తీసివేసి, మిగిలిన Fund ను H.R.C.E. special fund గ ఉంచి, దాంట్లోనుంచి కొంత Common Good Fund కు చేర్చడం జరుగుతుంది. దేవాలయముల మరమ్మతులకు, Religious propagandaకు, వేదాంతభోధకు ఇతర విద్యావ్యాసంగాలు మొదలైన వాటికి కుష్ఠురోగులకు చికిత్స చేయడానికి hospitals open చేయడానికి ఉపయోగింపబడుతుంది. ఈ Common Good Fund పీడిత మానవుల సౌకర్యంకొరకు ఈ సవరణలు తేబడినవి. అదికాక ఇంకొక కారణంకూడాఉన్నది. 1361 వ ఫసలీలో కోర్టులకు పోవడంవల్ల అంతకుముందు నోటీసులు ఇవ్వటానికి వీలులేక, వసూలు కాకుండా ఉండటమేగాక కొన్ని దేవాలయాలకు ఈ contributions లేవు. రెండువందల రూపాయలు మించని ఆదాయంవచ్చే దేవాలయాలనుంచిగాని, 4 వందలుమించని ఆదాయంవచ్చే మఠాలకుగాని ఈ contrbutions వసూలు చేయడంలేదు. కాని వాటి ఆదాయం అప్పుడప్పుడు పెరుగుతూఉంటుంది. ఒక సంవత్సరం ఎక్కువ రావటానికి అవకాశం ఉంటుంది. అందువల్ల వెనుక మూడు సంవత్సరాలలో కూడ ఏవైనా ఆదాయాలు పెరిగి నోటీసులు ఇవ్వటానికి వీలులేకుండా ఉన్నవిగాని, 1361, 62, 63 ఫసలీలలో నోటీసులు ఇవ్వటానికి వీలులేకుండా, escape అయిన దేవాలయాలుగాని ఏవైనా ఉంటే ఉండవచ్చును. వాటికికూడ లెవీ వసూలుచేయడానికి వీలు ఉండేటట్లుగా ఇపుడు ఈ సవరణలు తేబడినవి. ఆ విధంగానే యీ సవరణలు ఉన్నాయి. ఈ బిల్లు non-controversial అయినటువంటిదే. ఇప్పటికే డబ్బు వసూలుకాక పోవడం వల్ల ప్రభుత్వం పెట్టుబడికూడ పెట్టవలసి వచ్చింది. ఇప్పుడు బాకీలు అన్నికూడా తీర్చవలెను. అందువల్ల దీనిని త్వరగా pass చేస్తే, ఆ డబ్బు వసూలుచేసి ప్రభుత్వానికి ఇయ్యవలసిన బాకీని—తీర్చివేసి తరువాత మిగిలితే దేవాలయముల అభివృద్ధికొరకు వినియోగిద్దామనే ఉద్దేశంతో ఈ సవరణలు తేబడినవి. కనుక యీ బిల్లును మీరందరు accept చేయవలెనని కోరుతున్నాను.

MR. SPEAKER: Motion moved—

"That the Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill, 1955 be taken into consideration."

SRI B. SANKARAYYA :—ఇటీవల మంత్రిగారు రాజమండ్రిలో ధర్మకర్తలకు, పూజార్లకు ఒడంబడిక చేసినట్లుగా పత్రికలలో వచ్చింది. ఇపుడు ఈ బిల్లు పెట్టుతూ అటువంటిది ఎందుకు సూచించలేదో బోధపడడంలేదు.

THE HON SRI K. CHANDRAMOULI :—ఈ బిల్లుకు దానికి ఏమీ సంబంధంలేదు. ఈ బిల్లు contributions వసూలుకు సంబంధించినది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, మన మంత్రిగారు అన్ని చాల simple గా, తేలికగా ప్యాసుఅయ్యే Bills నే తీసుకొని వస్తూఉంటారు. కాని చర్చఅంతా అయిపోయినతర్వాత మధ్య మధ్య వాయిదా వేయడమో, ఉపసంహరించుకొనవలసిన అవసరమో కూడ కనబడుతూఉంటుంది. దీనిలో మూడో నాలుగో, sections refer చేశారు.

ఇదివరలో కొన్ని bills కు original section తో పాటు Amendment Bill అందజేశారు. ఇక్కడ దీనికి సంబంధించిన original section ఇవ్వలేదు. ఇక్కడ section 78 వున్నదనుకోండి. దీన్ని ఒక్కదాన్నే మేము చూడవలసి యుంటుంది. 79 వ section లో చూడండి. 79 (a) "Levy of contributions in the case of institutions assessed for the first time" అని పెట్టినదాంట్లో ఆ చిట్టచివర "fasli in which such institutions are assessed as aforesaid irrespective of the fasli in which a notice in issued." అన్నారు. అంటె ఏమిటి ? వీటికి original sections ఏ విధంగా వున్నాయో, ఇవన్నీ తెలుసుకొని ఈ బిల్లును pass చేయాలా, లేకపోతే మంత్రిగారి explanation చాలా simple గా వున్నదని, తృప్తికరంగాను ఉన్నదని pass చేయాలా అనే అనుమానం కలుగుతున్నది. మాకు అసలు original bills కావలసియుంటుందని మేము ఇదివరకే మీ దృష్టికి తీసుకువచ్చాము. ఒకవేళ మీరుతెచ్చినట్లే మేముకూడ pass చేసినట్లయితే, తరువాత అనేక సవరణలు మేము తీసుకు రావలసియుంటుంది, మీరు తీసుకురావలసియుంటుంది. మనందరికీకూడ కష్టంగా ఉంటుంది. అందువల్ల ఇప్పుడు మునిగిపొయ్యేదేమి లేదు. Urgency ఏమిలేదు. డబ్బు కావాలంటారా వున్నదాంట్లో కావలసినంతతీసుకోండి. అందువల్ల మొట్టమొదట మా objections మాత్రము మీ దృష్టికి తీసుకువచ్చాము. దీనికి original sections లేనిదే ఏమిచేయడానికి కష్టముగా వుంటుంది, మీరిచ్చిందే ఈ 4 lines, చదువుకొని దీన్ని pass చేయడంకాకుండా, ఏదైతే amend చేయబోయేమో వాటికి ఒక explanatory note రూపములో ఇవ్వవలసియుంటుంది.

ఈసందర్భంలో ఒక విషయం మీ గుర్తుకు తెస్తాను. అది మీకుకూడ తెలుసు. Hindu Religious and Charitable Endowments Act గురించి మనమందరము కూర్చొని ఒక బ్రహ్మాండమైన రిపోర్టు తయారుచేశాము. Almost bill form లోనే తయారు చేశాము. అప్పుడువున్న మంత్రివర్గము విశ్వనాథంగారు అందరుకూడ ప్రతి clause ను, High Court, Supreme Court Judgments వగైరాలన్నీ చాలా జాగ్రత్తగా చర్చించాము. అది Advocate-General దాకాకూడా పోయింది. కాని అది ఇంతవరకు బయటికిరాలేదు. దాన్ని ఇంతవరకు consider చేసినట్లులేదు. Piecemeal గా ఎందుకుచేయాలనే ఉద్దేశ్యంతో act నే complete గా మార్చేటట్లుగా తీసుకువచ్చాము. అది కష్టముతో తయారుచేసినటువంటి ఆ రిపోర్టు ఏమి చేశారో తెలియకుండా ఉన్నది. మా శ్రమ అంతా వృధా అయిపోయిందేమోనని అనుకోవలసివస్తున్నది. కనుక అటువంటి వాటిని తీసుకు రాకుండా ఈ బిల్లును తెచ్చిపెట్టారు. ఇప్పుడు దీంట్లో 5% contribution తీసుకొంటున్నామని అంటున్నారు. తీసుకోవచ్చు. కావలసినడబ్బు తీసుకొని ఖర్చుపెట్టి మన ప్రభుత్వానికి వేరే burden లేకుండాచేయడం అనేది అంగీకరించవలసిన విషయమే. కాని ఇక్కడకు వచ్చేటప్పటికి Common Good Fund అనేదాంట్లోనుంచి provide చేస్తారు. వారు తీసుకొనేటటువంటి 5 per cent లోనుంచి pro ide చేస్తారా, లేకపోతే వారు 5 percent తీసుకోగా కొంచెము డబ్బు మిగులుతుంది కదా, అందులోనుంచి తీసుకొంటారా? అసలు అందుకే Original Act కావాలి అని నేను కోరింది. అప్పుడు మనము దీన్నిచర్చించి ఒకనిర్ణయానికి వచ్చాము. దాంట్లో, Common Good Fund ను కొంత వసూలు చేయవచ్చునని దాన్ని కొన్ని purposes కు వుపయోగించాలని, దానిమీద తీవ్రమైన చర్చలు జరిగినవి. అది ఎంత percentage అనేది కాకుండే, ఈ 5 percent లోనుంచి, ఇంకా కొంత మిగిలినదాంట్లోనుంచి చేస్తామనే అభిప్రాయానికివచ్చారు. ఈ Common Good Fund విషయంలో, దీంట్లో ఏదో గోడలకు repairs కుగాను ఖర్చుపెడతామ నేవిధంగా చెప్పారు. Educational development కు, educational institutions కు దీన్ని ఎక్కువ ఉపయోగకరంగా చేయాలని అప్పుడు అనుకొన్నాము. తరువాత Section 76 (a) of the Madras Act చూస్తే ఇదికూడ కొంత confusing గా draft చేయడం జరిగిందేమో అనుకొంటాను.

MR. SPEAKER: While amending the Act, bringing 59 (a), we defined Common Good Fund, and also provided for the constitution of the Common Good Fund and also for

the application of the Common Good Fund for certain purposes.

Sri PLLALAMARRI VENKATESWARLU :—కాని అప్పుడు దానిలోనుంచి తీసుకోవలెనా లేక మిగిలిన డబ్బులో తీసుకోవలెనా అనే point ఒకటి చెప్పాము.

MR. SPEAKER : After the charges for the Government are defrayed the surplus will go to the Common Good Fund.

Sri PILLALAMARRI VENKATESWARLU:—తరువాత 76 (a) "Valuation of contributions levied అనేది తీసుకువచ్చారు అనుకోండి. అది చూచినట్లయితే, ఈ High Court and Supreme Court మఠాధిపతులకు property rights వచ్చినాయి. 76 క్రింద fix చేసేటటువంటి rights అన్నీ మళ్లీ ఇక్కడ చెప్పారు. అదికూడ దీనికి సంబంధించిందే. ఇదంతా ఏదో సరిగా అర్థం కాకుండా ఉంది. అసలు మాకు original sections లేకుండా చేయడ మనేది చాలా protest చేయవలసి యుంటుంది. ఇది ఎట్లా ఉన్నప్పటికినీ, ఈ బిల్లులో చిన్న చిన్న సవరణలకు పూనుకోవడంకంటె, అసలు ఆ రిపోర్టు ఆధారంగా చేసుకొని చట్టాన్ని సవరించవలసిన అవసరమున్నది.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఈ Common Good Fund ను ఏ విధంగా ఉపయోగించుకోవాలనేది ఇంతకు ముందుకూడ చర్చింపబడింది. మంత్రి గారుకూడ దీన్ని hospitals వగైరాలకు ఉపయోగిస్తున్నామని చెప్పారు. అంతే కాకుండా ఎక్కువగా orphanages కు, schools స్థాపించడానికికూడ పూనుకొని యీ Common Good Fund వృథాగా పోకుండా చేస్తారని ఆశిస్తున్నాను. తరువాత, అనేకచోట్ల trustees దేవస్థానమునకు సంబంధించిన డబ్బు అంతా దుబారాచేయడం జరుగుచున్నప్పుడు, వాళ్లను తీసివేస్తున్నారు గాని వాళ్లు ఎంత దుబారా చేశారు, ఎంత నష్టం కలుగజేశారు అనేది విచారణచేసి, ఆ నష్టాన్ని వాళ్ల property నుంచి రాబట్టడానికి ప్రభుత్వం ఏదైనా చర్య తీసుకొంటున్నదా అని నేను అడుగుతున్నాను. ఆవిధంగా దుబారాచేసినదాన్ని, ఆ నష్టాన్ని వారి ఆస్థులనుండి తీసుకొనేటట్లు చట్టాన్ని సవరించడం మున్ముందైనా తీసుకోవలెనని, తీసుకొంటె బాగుంటుందని ఆశిస్తున్నాను. అంతేకాకుండా, trustees కోర్టులకు ఎక్కి ఈ దేవస్థానం property ని అంతాకూడ పోగొట్టడం జరుగుతూంది. అదికూడ అరి కట్టడానికి పూనుకోవాలని నేను కోరుతున్నాను. తరువాత ప్రభుత్వం విధానంలో, ఈ దేవస్థానాలకు సంబంధించినటువంటి భూములు విషయంలో వేలముపద్ధతి మానివేసి

Field Labour Co-operative Societies ఉన్నచోట, వాటికి ఇవ్వవలసిందని కూడ చెప్పారు. అది ఉదారంగా ఉన్నది కాని అందులో పెట్టినటువంటి restrictions చాలా ప్రతికూలంగా ఉన్నాయనికూడా నేను మనవిచేస్తున్నాను. అందులో అయిదువేల రూపాయలు వరుంబడి ఉన్నవాటిని మాత్రము ఇవ్వాలి అని పెట్టడంలో సామాన్యంగా Field Labour Co-operative Societies కు వచ్చేటటువంటి భూములు ఉండవు. కాబట్టి దీన్ని సవరించి అన్ని దేవస్థానంభూములు ఈ societies కే ఇవ్వాలి అనేవిధంగా చేయవలసి యుంటుంది. మామూలుగా ఒక individual కు వేలము పద్ధతిలో ఇచ్చేదానికంటె సొసైటీలకిస్తే, ఎక్కువ లాభదాయకంగా ఉంటుందని మంత్రిగారికికూడ తెలుసు. అందువల్ల ఉదారంగానే మంత్రిగారు సొసైటీలకు ఇచ్చారు. అదే విధానం రాష్ట్రమంతటా అనుసరించవలసిందని కోరుచున్నాను.

I am requesting the Hon. Minister to bring another bill. తరువాత trustees విషయంలో, వంశపారంపర్యంగా వచ్చేవాళ్ళే ఉన్నందువల్ల దేవస్థానం డబ్బుఅంతా దుబారా చేయడం జరుగుతున్నది. ఈ భూములను, property ను అంతా వాళ్ల చేతిలో పెట్టుకొని కూర్చొంటారు. కనుక ఈ వంశపారపర్యంగా ఉన్నవాళ్ళనే వేసేటటువంటి విధానాన్ని తీసివేసి సరియైన trustees ను వేస్తారని, అప్పుడే ఏలాటి దుబారాగాని నష్టముగాని జరగకుండా ఉండడానికి వీలుంటుందని మనవిచేస్తున్నాను. ఉదాహరణకు గండవరం దేవస్థానంలో భూములున్నాయి. దాని విషయం విచారణలో ఉన్నదని మంత్రిగారు చెప్పారు. 1361 వ ఫసలీలో భూములు పండకుండా ఉండడంవల్ల దానికి నష్టమువచ్చింది. అందువల్ల ఆ రైతులందరు మేము మకతాలు చెల్లించుకోలేమని, అవి తీసివేయాలని అర్జీలు పెట్టుకొన్నప్పుడు, అక్కడ ఉన్నటువంటి trustees, executive officers ఇది నిజంగా తోసి వేయాలని ప్రభుత్వానికి సిఫార్సుచేశారు. ప్రభుత్వంవారు ఇది ఆలోచిస్తామని అట్లే pending లో ఉంచి ఈ సంవత్సరం అవన్నీ కట్టుకోకపోయినట్లయితే court కు వెళ్ళవలసి యుంటుందని చెప్పడం జరుగుతుంది. కాని ఈ విషయంలో కోర్టుకు వెళ్ళడం ప్రభుత్వానికి ఏ విధంగా లాభదాయకమని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. అక్కడ ఉన్నటువంటి trustees, executive officers కూడ ఇది యథార్థమని సిఫార్సుచేసినప్పుడు, ప్రభుత్వము తీసుకొనే prosecution witness అంతాకూడ trustees లు, executive officers అయినప్పుడు కోర్టుకుపోయి కొంతడబ్బు దుబారా చేసుకోవడమే అవుతుందిగాని, దానివల్ల ప్రయోజనమేమి ఉండదు. కనుక ఇవన్నీ దీర్ఘంగా ఆలోచించి దేవస్థానాలకు నష్టం లేకుండా ఉంచేటటువంటి

విధానాన్ని అవలంబించవలెనని, ముఖ్యంగా ఈ గండవరం దేవస్థానాన్ని ప్రభుత్వం దృష్టిలో ఉంచుకోవలెనని మనవి చేస్తున్నాను.

ఈ విధంగాచేస్తే దేవస్థానమునకు నష్టము, రైతులకు నష్టము వస్తున్నది. కొబట్టి యీ విధానము దేవస్థానానికి ఎంతమాత్రము లాభదాయకముగా లేదని మంత్రిగారికి మనవి చేస్తున్నాను.

తరువాత accounts audit చేయటానికి temple properties ఎంతెంత వున్నది అనేది లెక్కలు తీస్తున్నారా అని మంత్రిగారిని అడగదలచుకున్నాను. Common Good Fund ఏర్పడటానికి, ఒక్కొక్క దేవస్థానానికి ఎంతెంత ఆదాయమువస్తే యీ Common Good Fund కు చేర్చుతారు ? ఈ ఆదాయములోనుంచి యీ fund క్రింద ఎంత చేరుస్తున్నారు? ఈవిషయము తెలుసుకోవలసివున్నది. Audit reportsను తనిఖీ చేయటానికి ఎవరైనా ఉద్యోగస్థులు వున్నారా? అంటే auditors temple acconnts ను తనిఖీచేసి రిపోర్టులు తయారుచేస్తున్నారు. ఇవి సరియైన రిపోర్టులు అవునో కాదో చూడటానికి, యింకొవారిపైన ఎవరైనా ఉద్యోగస్థులు అజమాయిషీ చేస్తున్నారా ? ప్రభుత్వము యీ విషయములో అవలంబించేవిధానము యేమిటో మంత్రిగారు చెప్పవలసివున్నది. ఈ సూచనలు అన్నీ మంత్రిగారు గమనించి, దరిమిలానైనా, మంత్రిగారు మరొక సమగ్రమైన చట్టాన్ని తెస్తారని ఆశిస్తున్నాను.

SRI S. RANGANATHA MUDALIAR :—Original Section 79 reads like this :—

"It shall not be competent for the Commissioner to levy any contribution for more than 3 faslis immediately preceding the fasli in which a notice is issued under Section 78."

It is to obviate what is contained in Section 79 this additional Section 79-A has been provided for. "Notwithstanding anything contained in sub-section (1) of Section 79, where any religious institution is assessed for the first time in fasli 1361 or fasli 1362 or fasli 1363, it shall be competent for the Commissioner to levy any contribution for the three faslis immediately preceding the fasli in which such institution is assessed as aforesaid, irrespective of the fasli in which a notice of assessment is issued under Section 78."

Sri S. Ranganatha Mudaliar] [30th September 1955

Now the question is whether this new clause does not over-ride the sections of the Limitation Act and if it does not, I would like the Hon. Minister to clarify on the point.

MR. SPEAKER : Your point is that it is inconsistent

THE HON. SRI K. CHANDRAMOULI :— అధ్యక్షా limitation కాలం మూడు సంవత్సరములు అయిపోయింది కనుకనే వసూలుచేయటానికి చిక్కులు వచ్చినవి. అందువల్ల 1361, 1362, 1363 ఫసలీలలో యీ విషయము కోర్టులలో ఉండడమువల్ల కమిషనర్లు డబ్బు వసూలుచేయటానికి వీలులేకుండా పోయింది. Commissiners కు orginal గా గత మూడుసంవత్సరముల levy వసూలు చెయటానికి అధికారము మాత్రమే వున్నది. అంతవరకే. అంటే గత మూడుసంవత్సరములలో రావలసినదాన్ని మరుసటి సంవత్సరము నోటీసుయిచ్చి వసూలు చేయవచ్చునన్నమాట. అందువల్ల వసూలుచేసే విషయములో ఆలస్యము అవుతూండేది. 1361, 1362, 1363 ఫసలీలలో levy లు వసూలుకాకుండా వుండడమువల్ల 1361 వ ఫసలీలో obstruction వచ్చింది కాబట్టి ఆ క్రితం సంవత్సరాలకు రావలసిన డబ్బు కూడా వసూలుచేయటానికి అంటే 1358, 1369, 1360 ఫసలీలబాపతు బాకీలుకూడా వసూలు చేయడానికి ఈ సవరణవల్ల కమిషనరులకు అధికారం ఉంటుంది. లేకపోతే గతసంవత్సరాలలో ఇవ్వవలసిన బకాయిలు వసూలుకానటువంటివి ఏవైనా ఉంటే అవి వసూలు చేసుకునేదానికే ఈ సవరణ ఉద్దేశంకాని వేరు అభిప్రాయమేదీలేదు.

MR. SPEAKER : This is an exception to that rule, Mr Mudaliar.

SRI S. RANGANATHA MUDALIAR :—Whether it is competent for a local Legislature to over-ride the provisions of the Limitation Act, that is my doubt. Whether it is competent by bringing in a measure like this to over-ride the sections of the Indian Limitation Act.

MR. SPEAKER : Limitations are created by this Act, and not by the Limitation Act. Apart from that, the limitation is created not by the Indian Limitation Act. The limitation is here created by Section 79, that for three years prior to the issue of a notice, we can demand. Not more than that.

SRI S. RANGANATHA MUDALIAR :—But that is consistent with the Limitation Act. Original Section 79 embodies the principles contained in the Limitation Act.

MR. SPEAKER : Mr. Mudaliar, you remember there is a special law fixing limitation. It over-rides the general law. This is a special law under which the limitation is fixed for collection of arrears and Government now seek an exception to that rule 79.

SRI V. VISVESWARA RAO:—అధ్యక్షా, ఈబిల్లును controversy యేమీ లేకుండా అందరు అంగీకరించవచ్చును. ఇదియేదో High Court లో లోగడ అందరికిచెందిన point యే. High Court లో ఏదో ఒక చిన్న point ద్వారా గావడమువల్ల యీస్థితి యేర్పడింది. అందువల్ల దీనికి ఏమాత్రము అభ్యంతరము పెట్టకుండా అందరూ ఆమోదించవలసిందిగా మంత్రిగారు కోరుతూ చెప్పారు. అయితే ఈసాడుచూస్తే, దీనికి general గా వున్నదాన్నిబట్టిచూస్తే నేను కొన్ని ముఖ్యమైన సూచనలుచేసే ఉద్దేశ్యముతో ముందుకు వచ్చాను. అసలు యీ యాక్టుకు సంబంధించిన బిల్లు మొదట్లో 1951 వ సంవత్సరములో వచ్చింది. కాని తరువాత చాలాసార్లు యీ యాక్టుకు మార్పుల విషయమై చాలాసార్లు చర్చకు వచ్చియుండవచ్చు. దేవాలయాల కమిటీవారు ఒక రిపోర్టుగూడా యిచ్చారు. తరువాత Hindu Religious and Charitable Endowment Administration report కూడా యిచ్చారు. అందులోచూస్తే, అసలు అర్చకులస్థితి, దేవాలయాలలో జరిగే పూజ పునస్కారములు జరిగేస్థితి, వారియొక్క పరిపాలనను గురించి, యీ administration report లో కొన్ని సంగతులు వ్రాయబడి వున్నవి. అందులో ముఖ్యమైనవి కొన్ని విషయాలు సభ్యులకు చదివి వినిపించుతాను.

"Religious side of the temples is wholly neglected. Only administration side is being looked after. As a result, most of the archakas do not know the rudiments of worship and in very many cases the observance of daily rituals is short circuited. The archakas in Telugu Districts appear to be more interested in enjoying the income over the lands of temples than understanding their duties to deities."

అని వ్రాసియున్నది. అంటే యీ బిల్లువచ్చి సుమారు నాలుగుసంవత్సరాలు అయింది. అప్పుడు యీ Hindu Religious and Charitable Endowments

Sri V. Visweswara Rao] [30th September 1955

Act వచ్చింది. అప్పుడు ప్రభుత్వము దేవాలయాలను అభివృద్ధి చేయాలని, అందులో జరిగే పూజపునస్కారాలు సక్రమంగా జరిగేటట్లు చేయాలని, యింకా అభివృద్ధి చేయాలి అని, తలపెట్టింది. ఈ మధ్యనే మంత్రిగారు అనేక దేవాలయాలకు పర్యటన చేయడమునకు వెళ్ళి యింకను అర్చకులకు శిక్షణశాలలు ఏర్పాటు చేస్తామని మంత్రిగారు చెప్పడము జరిగింది. మంత్రిగారు చెప్పినప్రకారము అప్పుడే మూడు చోట్ల యీ శిక్షణశాలలు ఏర్పాటు చేయడముకూడా జరిగింది. అయితే యిన్ని చెప్పినప్పటికినీ administration side గాని, మతప్రచారము side గాని, దేవాలయాలలో పూజ పునస్కారముల విషయములోగాని మంత్రిగారు ఏలాంటి చర్య తీసుకోలేదు. అందువల్ల యీ యాక్టు వుండీకూడా యేదైనా ప్రయోజనము వున్నదా అని సందేహించవలసి వస్తున్నది.

తరువాత దేవాలయముయొక్క ఆదాయములో నుంచి నూటికి అయిదుపాయలవంతున Common Good Fund కు కేటాయించే విషయములో హైకోర్టు అభ్యంతరము చెప్పిందేగాని, యాక్టువిషయములోగాని, యింకా ఏ రూపములోనైనా దేవాలయమును అభివృద్ధి చేయడంలోగాని, High Court అభ్యంతరము పెట్టియుండలేదు. అంతవరకూ యీ యాక్టు సక్రమమైనదేనని తీర్పుచెప్పడము జరిగింది. కాని యీనాడు దేవాలయముల విషయములో జరిగే అవినీతులు, అరికట్టటానికి, మతసందర్భాలు కాపాడటానికి యీ దేవాలయాలు సరియైన స్థితిలో నడపబడుతున్నాయా అంటే, అవిఏమీ కనపడవు. మనలో ఎవరైనా ఒక పర్యాయము sight seeing కొరకు వెళ్లినప్పుడు, యీ దేవాలయాలు తటస్థపడినచోట పరిశీలించి చూచినట్లయితే, వాటియొక్క అభివృద్ధి ఎక్కడాకూడా కన్పించదు. ఎక్కడ చూచినా దేవాలయాలు పాడుపడినవి కన్పిస్తాయే గాని, వృద్ధికి వచ్చినవి ఎక్కడకూడా కన్పించవు. వాటిని అభివృద్ధిచేసే లక్షణములుకూడా ఏవీ కన్పించవు. ఇదే విధంగా trustees ను నియమించే సందర్భంలోగూడా ముగ్గురునుంచి ఒక్కరుగానైనను, కాక అయిదుగురు వున్నచోట ముగ్గురుగాను ఉండే ఏర్పాటు చేస్తానని ప్రశ్నల సందర్భములో మంత్రిగారు చెప్పారు. దీనికి కారణము యేమిటని మంత్రిగారిని అడిగితే దేవాలయముల సందర్భములో ఒకరికన్న ఎక్కువమందివుంటే, వారు పోట్లాడుకోవటము తప్ప దేవాలయములను అభివృద్ధిచేసే సందర్భాలు తక్కువగా వుంటున్నవి. అందువల్ల అట్లా చేయదలచానని చప్పారు. దీనికి నేను ఒకవిషయము చెప్పదలచాను. ఒక్కరే ట్రస్టీగావున్న కొన్ని దేవాలయములు నేను ఎరుగుదును. అసలు అక్కడ జరిగే సంగతులు బైటవారి కెవ్వరికి తెలియకుండా వుంటవి. దేవాలయాలకు పెద్దపెద్దఆస్తులు వున్నచోట గ్రామములోని యితరులకు ఎవ్వరికీ

తెలియజేయకుండా, పనులు జరుగుచున్నవి. బహిరంగముగా భూములు అమ్మకమునకు వేలము వేస్తామనిగాని, వేయబోతున్నామనిగాని చెప్పి, ప్రజలకు తెలియకుండా తనలో తాను ఎవరికో తనబంధువుల పేరటికో, మిత్రుల పేరటికో భూములను పాట పెట్టి, వాళ్ళపేర కొట్టివేసినట్లు చేసి, దేవాలయాలకు రావలసినటువంటి ఆదాయము రాకుండా చేస్తున్న కోట్లు ఎన్నోవున్నవి. దీనికి మంత్రిగారు ఏమిచెబుతారో తెలియాలి. ఆ విధంగా చేసేవారు నూటికి చాలామంది వున్నారని మంత్రిగారు గుర్తించాలి. ఉదహరణకు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు కృష్ణా జిల్లాలో కృత్తివెన్నుఅనే గ్రామములో సుమారు 70 ఎకరాల భూమియిచ్చారు. ఆదేవాలయమునకు ఒకరే ట్రస్టీగా వుండడమువల్ల, ఇతరులకు ఎవ్వరికినీ తెలియకుండా యీ భూమినంతయు అమరకమునకు పాటపెట్టినట్లు నటించి, ఎకరాకు ఒకటింటికి ఒక బస్తావంతున వేలముపాట పెట్టినట్లు, కొట్టివేసినట్లు కనబరిచారు. ఎందువల్ల యింత తక్కువకు యిచ్చారు, యీ విధంగ జరగటానికి కారణముయేమిటని విచారిస్తే, ఈ భూమిలో తాను స్వలాభము పొందుతున్నాడని, పాటపెట్టినట్లైయితే యితరులకు ఆ భూమిని యివ్వవలసివస్తుందని, అందులోని లాభము తనకులేకుండా పోతుందని, దేవాలయము సొమ్ము తాను స్వంతఖర్చులకు వుపయోగించుకోవాలనూ దురుద్దేశ్యముతోనూ ఆయన యీవిధంగా చేస్తున్నట్లు బైటపడింది. ఒక్కరే ట్రస్టీగావుంటే, దేవాలయముయొక్క పరిస్థితులు బైటవారికి తెలియవు. ఒకరుకన్న ఎక్కువమందివుంటే, అంటే ముగ్గురువున్నట్లైయితే, దేవాలయముయొక్క ఆదాయవ్యయములు జవాబుదారి ముగ్గురిమీద వుంటుంది. బాధ్యతవహించి పనిచేయటానికి వీలుఅవుతుంది. కాబట్టి, మంత్రిగారు దేవాలయమునకు ఒక్కరినే ట్రస్టీగా వుంచబోతామని చెప్పడము సరియైన పద్ధతి కాదనినమ్ముతారని ఆశిస్తున్నాను.

Mr. SPEAKER :—Please come to the point.

SRI V. VISWESWARA RAO :—Yes Sir, I am coming to the point. ఈనాటి temple administration గురించి, general గా కూడా మాట్లాడాలనుకున్నాను.

Mr. SPEAKER :—Third Reading జరిగేటప్పుడు మీరు general administration ను గురించి మాట్లాడవచ్చును. ఇప్పుడు యాక్టులోని provisions ను గురించి మాట్లాడవచ్చును.

SRI V. VISWESWARA RAO :—నా Point ఏమిటంటే, దేవాలయము income లో నుంచి 5% తీసుకొంటున్నప్పుడుగూడా, దేవాలయములో

Sri V. Visweswara Rao] [30th September 1955

సక్రమంగా పరిపాలన జరగడములేదు. కాబట్టి ఆ 5% కూడా రావడములేదు. ఇంకా ఎక్కువ తీసుకోటానికి పద్ధతులువున్నవి. అవికూడా చేయడములేదు. ఈ విధముగా దేవాలయభూములు అమరకము చేసేసందర్భము కాకుండా, గ్రామములో వున్న పదిమందికి తెలియజేసి వేలముపాట సక్రమంగా పట్టినట్లైయితే, దేవస్థానానికి నిజముగా ఎక్కువ ఆదాయము సంపాదించటానికి వీలువుంటుంది. నిజానికి యీనాటి పరిస్థితులలో కృత్తివెన్ను గ్రామాంలోని దేవాలయము తాలూకు భూములలో ఎకరమునకు నిజంగా ఒక్కబస్తా వస్తుందో యింకా ఎన్నిబస్తాలు వస్తాయో, వేలముపాట పెట్టిస్తేనిజస్థితి బైటపడుతుంది. ఇదివరకు ఒకబస్తాయిస్తేవచ్చే అయివజు కన్న వేలము పెట్టితేవచ్చే అయివజు ఎన్నోరెట్లుగా వుంటుందని మంత్రిగారు గుర్తించాలి. ఈ విధంగాచేస్తేనే, Common Good Fund కు నూటికి అయిదు రూపాయలు చేకూరే అవకాశాలు వుంటాయి. అదే నాపాయింటు.

ఈ విధంగా వాటినన్నింటిన్నికూడా 10 మందికీ తెలిసేటట్లు పాటలుపెట్టించడానికి ప్రయత్నంచేస్తే మనకు ఒకబస్తానుంచివచ్చిన అయివేజుకన్నా ఇంకా ఎక్కువ అయివేజువచ్చినప్పుడు 5% ప్రభుత్వానికి రావడానికి అవకాశమువున్నదనే నా పాయింటు. అదేవిధంగా ఇంకా కొన్ని గ్రామాలు నేను చెప్పగలను. ఈ మధ్యనే ఒక గ్రామంలో పచ్చికబీళ్లను పాటకుపెట్టినారు. రు. 307 లకు పాటపాడినారు. అది చివరకు దేవాలయకమీషనరుదగ్గరకు తీసుకువెళ్లినప్పుడు ఆ పాట రద్దుచేసి తిరిగి మరల పాటపెడితే 13 వందల రూపాయిలువచ్చింది. ఒకే ట్రస్టీఅనిపెట్టడంతో, ఆ ట్రస్టీ యేగ్రామంలో ఎవరికి తెలియపరచకుండా పాటలు పాడుకోవడం, తన బంధుమిత్రులద్వారా పాటలుపాడడం దేవాలయములకు ఆదాయమురాకుండా చేయడం, అందువల్ల దేవాలయాలకు అభివృద్ధిపనులు ఏమీ జరగకుండా ఆగిపోతున్నాయని నా అభిప్రాయం. ముగ్గురువున్నాకూడా అట్లాగే చేస్తారని మంత్రిగారు చెప్పారు. కాని చాలా గ్రామాలలో 2, 3 పక్షాలు వుంటాయని అందరికీ తెలిసిందే. ఆ రెండు మూడు పక్షాలనుంచీకూడా ట్రస్టీలను నియమించితే తప్పకుండా ఈమూడు పక్షాలవారికికూడా పాటపాడేకాలము తెలియుడమువల్ల ముగ్గురువచ్చి పాటపాడుకోవడానికి అవకాశం వుంటుందని, ట్రస్టీలు అనేపేరుతో ఒకేపార్టీనుంచి తీసుకోవాలనే పద్ధతి లేకుండా చేయాలని నా అభిప్రాయము. అదేవిధంగా వంశపారంపర్య ట్రస్టీలుకూడా కొంతమంది వున్నారు. దేవాలయములోని వస్తువులు తమ స్వంత ఆస్తులనేపేరులలో వాటిని ఎప్పుడూకూడా పాటకుపెట్టడములేదు. అటువంటిది ఎక్కువఖర్చులు వున్నప్పటికీకూడా, ఎక్కువచూపు వున్నప్పటికీకూడా వాటన్నిం

టినీకూడా తమ స్వంతానికి వుపయోగించుకోవడము జరుగుతోంది. కాని ఆవిధంగా జరుగనీయకుండా చేయాలని నేను కోరుతున్నాను.

Charitable Endowments గురించి ఇక్కడ ఒక చిన్నవిషయం చెప్పారు.

Nothing has so far been done in regard to administration of charitable endowments which are innumerably spread all over the State. In a few cases, after enquiry by this Department on cases being brought to its notice, recommendations were made to Government for notifying such endowments for bringing them under the provisions of the Act. The Department is handicapped in not having a complete list of charitable endowments as in the case of religious institutions. If such lists along with copies of Inam B. Registers are made available by the Revenue Department, earnest attempts can be made to enquire into their working." అని చెప్పారు.

MR. SPEAKER :—You are reading from the Administration Report.

SRI V. VISWESWARA RAO :—రివెన్యూమంత్రిగారు రివెన్యూశాఖ చూస్తూ, religious endowments ను గూడా చూస్తున్నారు. అయినప్పటికీ Revenue Department వీరందరికి leading institutions అన్నీ సప్లయిచేయ లేదుకాబట్టి Endowments Board కు వాటికి సంబంధించిన రికార్డులుఅన్నీ లేకుండాపోయినాయని చెప్పి ఈ రిపోర్టులో చెబుతున్నారు. అంటే దీనిని co-ordinate చేయడానికి తీసుకున్నటువంటి చర్యలుగాని, దానిని అమలుజరపడానికి గాని తగినటువంటిచర్యలు తీసుకుని దానిని వెంటనే ఒకరూపంలో తీసుకురావడము అనేవిషయం చాలా తక్కువ అని నాఅభిప్రాయం. ఈవిధంగా మనం 5% తీసుకుంటాము. లేదా అదే సమస్యకాదు. అది హైకోర్టులో తీసినప్పటికికూడా కాని దేవాదాయాలకు వచ్చేటటువంటి అయివేజును అనేకరూపాల్లో ఆయాప్రాంతాలలో వున్నటువంటి స్థానికమైన ట్రస్టీలుగాని లేకపోతే అక్కడవున్నటువంటి executive officers కానిదానిని కేటా చేయడానికి ప్రయత్నము చేసినప్పుడు మనం తీసుకుపోయేటటువంటి 5% కూడా సరిగా లేదనిచెప్పి, ఇక్కడ ఉద్దేశించబడుతున్నటు

వంటి 5% కూడా చాలా మటుకు మరిపించబడుతున్నదని చెప్పి నేను అభిప్రాయపడుతున్నాను. అందువల్ల religious endowments ను, charitable endowments ను సక్రమంగా ఒకరూపంలో పెట్టాలని నేను కోరుతున్నాను.

SRI M. R. APPA RAO :—అధ్యక్షా, Common Good Fund అని గవర్నమెంటువారు ఇదివరకు ఏర్పాటుచేశారు. ఇప్పుడు మీరు తీసుకువచ్చి పెడుతున్నారు. ఇవి ముఖ్యంగా విద్యవిషయంలో, ప్రజోపయోగ కార్యక్రమాలలో వుపయోగించాలని చెబుతున్నారు. దీనికంటె ముందు ఇంకొ పెద్దపెద్ద దేవాలయాలను జమీందారీలు అబాలిషను అయినతరువాత, కొన్నిపూళ్లలో జమీందారీ దేవాలయాలు వుండేవి. ఆ దేవాలయాలుఅన్నీ పోయినతరువాత ఆదాయం ఏమీలేకుండా పోయింది. మా నియోజకవర్గంలో అగిరిపల్లి దేవాలయము అనేది ఒకటివున్నది. దానికి ఇప్పుడు ఏమీ ఆదాయము లేకుండాపోయింది. అందుచేత యీ ఫండుతో అటువంటి దేవాలయాన్ని అభివృద్ధిచేయడానికి వుపయోగించవలసిందని ఇదివరకు ప్రొవిజనులేదు. ఇప్పుడు మంత్రిగారు అటువంటి ప్రొవిజను పెట్టామని చెబుతున్నారు. అందువల్ల అదిముఖ్యంగా తీసుకోవలసిందని మంత్రిగారికి చెబుతున్నాను.

Sri B. SANKARAYYA :—అధ్యక్షా, ఇప్పుడు ఈ సవరణలో తీసుకుని వచ్చినటువంటిది, ఈ Common Good Fund లో కలపడము అనేది చాలా చిన్నవిషయం అవుతున్నదని చెప్పారు. కాని కొత్తగా, ఈ ధర్మాదాయాలను నిర్వహించడంలో ఇప్పుడు ప్రభుత్వంవారు అవలంబించే పద్ధతులు చూస్తే దానిని ఏ మాత్రం కూడా బలపరచడానికి వీల్లేదని నా అభిప్రాయము. ఎందువల్ల అంటే, ఇప్పుడు ఈ ధర్మాదాయాలన్ని నిర్వహించడానికి తప్పకుండా చిన్నదేవాలయము అయినాసరే, తాము చేయవలసిన సామాన్యమైన పనులు చేసినా చేయకపోయినా ఖర్చులకు అని చెప్పి మొదట వ్రాస్తున్నారు. Common Good Fund అనేది తీసుకుంటే అది వేరే విషయం. ఈవిధంగా ఈ పరిపాలన అంతా సక్రమంగా నిర్వహించడానికని చెప్పి వసూలు చేసినటువంటి డబ్బును, Common Good Fund లో కలుపుతాము అంటున్నారు. ఈ డిపార్టుమెంటు యొక్క పద్ధతి ఏవిధంగా వున్నదంటే అప్పుడు మొత్తంవున్న గజెటెడ్ ఆఫీసర్లు 11 మంది ఉన్నారని చెప్పారు. రెండు జిల్లాలకు కూడా ఒక అసిస్టెంటు కమీషనరు వుంటారు. మొత్తం రాష్ట్రానికి అంతా కలసి ఒక డిప్యూటీ కమీషనరు వున్నారు. ఇప్పుడు ఒక ఇన్‌స్పెక్టరు వున్నారు అంటే అతను ఎక్కడ వుంటాడో, ఆయన గుమస్తా ఎవరో, ఆయన ఆఫీసు ఎక్కడో కూడా తెలియదన్నమాట. ఆయనకు జాబులు వ్రాయాలంటే ఎక్కడకు వ్రాయాలో కూడ

తెలియదు. ఈవిధంగా ఈ పరిపాలనా ఏ మాత్రం సరిగా జరిగేదానికి అవకాశం లేకుండా కావలసినటువంటి ఖర్చును పెట్టకుండా ఈడబ్బును తీసుకుపోయి Common Good Fund లో కలుపుతాము అనే, విషయం సరిగాదు. ఇప్పుడు ఒక్క జిల్లాలోనే సామాన్యంగా ఏ డిపార్టుమెంటు అయినా నిర్వహించడానికి, ఒక జిల్లా అధికారికి వీలులేక ఇద్దరు ఆఫీసర్లను ఒక జిల్లాలో వేస్తున్నారు. అటువంటప్పుడు ఇప్పుడువున్నటువంటి దేవాదాయాలను సక్రమంగా నిర్వహించాల్సి వున్నటువంటి పరిస్థితుల్లో జిల్లాకు కనీసం ఒక్క ఆఫీసరుఅయినాలేదు. ఇక ప్రతి తాలూకాకు ఒక ఇన్‌స్పెక్టరు వుంటే వారికి ఆఫీసులేదు. ఏవిధంగా ఈ పరిపాలన సక్రమంగా జరుగుతుంది అనేది ఏవిధంగా ప్రభుత్వానికి తెలుస్తుంది? ఇప్పుడు ఇదీ అంతా ధర్మానికి సంబంధించింది అంటున్నారు. అసలు భూమి బొత్తుగా పండకపోతే, దానికి గవర్నమెంటుకూడా శిస్తు ఇస్తే ఈ charitable institutions కు సంబంధించినవారు దీనికి శిస్తు రెమిషనుకూడా ఇవ్వరు. అటువంటప్పుడు ప్రభుత్వానికిగాని డిపార్టుమెంటుకుగాని అక్కర పడితే ఒక్కదానికైనా జవాబు చెబుతున్నారా? ఇందాక వేమయ్యగారు గన్నవరం గురించి చెప్పారు. అటువంటివి ఎన్నో పూర్లు ఇవ్వాళ బయట పెట్టగలము. అసలు ఈ డిపార్టుమెంటులను సక్రమంగా నడుపడానికి కావలసిన పద్ధతులు అన్నీ అవలంభించిన తరువాత మిగిలిన దానిని ఏ విధంగానైనా ఖర్చుపెట్టవచ్చును. అసలు ప్రభుత్వ వుద్దేశ్యాలు చూస్తే ఈ పరిపాలన అంతాకూడా సక్రమంలో వున్నా లేకపోయినా అక్కడక్కడ కొంతమంది తమ తమ అనుచరులకో ఇది అంట పెట్టడానికి అనువయ్యే పరిస్థితిలో వున్నదిగాని—.

THE HON. SRI K. CHANDRAMOULI :—శంకరయ్యగారు అసలు వ్యవహారము అర్థం చేసుకోకుండా మట్లాడుతున్నారండి. 100కి 5 రూపాయలు వసూలు చేసింది establishment కు మామూలు administration కు పోను ఏమైనా మిగిలితే అది Common Good Fund లోకి పోతుందని చెప్పాను కాని, ఇది అంతా కూడా తీసుకువెళ్ళి Common Good Fund లో పెడుతున్నారు, administration లో పెడుతున్నారు, అంటే ఇది అంతా అర్థముకానటువంటి విషయం.

SRI B. SANKARAYYA :—నేను చెప్పిందికూడా అదే. "దీంట్లో మిగిలితే" అని మీరు అన్నారు. అసలు కావలసినది ముందు మీరు ఏర్పాటు చేశారా అని అడుగుతున్నాను. మిగలడానికి ముందు ఈ డిపార్టుకు ఈ ధర్మ సంస్థలు అన్నింటిని నిర్వహించడానికి కావలసినటువంటి పనులన్నీ ముందుమీరు

చేశారా! తరువాత తరగతిలోకి విషయం అప్పుడు తీసుకుండాలి. చాలా అత్యవసరమైనటువంటి విషయాలనే మీరు తృణీకరించి ఇప్పుడు మిగిలితేనే అని చెబుతున్నారు. కనీసం ఇప్పుడు జిల్లాకు ఒక ఆఫీసరు అయినా జిల్లాలోని మొత్తం సంస్థలన్నీ చూడ్డం అవసరం వున్నదా లేదా? ఒక ఇన్‌స్పెక్టరు, ఒక తాలూకాకో రెండు తాలూకాలకో వుంటే ఆయనకు ఒక ఆఫీసు వుండాలా అక్కరలేదా? ఉత్తరాలు వ్రాసే వారికి ఒక అడ్రసు అయినా వుండాలా అక్కరలేదా? ఆ ఉత్తరాలకు జవాబులు వ్రాయడానికి ఒక గుమాస్తా వుండాలా అక్కరలేదా? ఇటువంటి సామాన్యమైనటువంటి అత్యవసర విషయాలుకూడా చేయకుండా మేము ఏదో తీసుకుపోయి ఇంకెక్కడనో ఖర్చుపెడతామంటే, దేనికి ఖర్చుపెడుతున్నారో ఇప్పుడు చెప్పలేదు. ఇదివరకు దేనికిపెట్టారో చెప్పలేదు. ఇటీవల ప్రభుత్వం లక్షలు ఆదాయాలువచ్చే దేవాలయాలనుంచి కొంతభాగము అర్చకులకు కట్టిపెడుతున్నట్లుగా ఒక అగ్రిమెంటు వ్రాస్తున్నట్లుగా మొన్న పత్రికలలో వచ్చింది. మంత్రిగారిని అడిగినాకూడా లేదని చెప్పలేదు. అటువంటి విషయాలు ఇప్పుడు......

THE HON. SRI K. CHANDRAMOULI :—కట్టిపెట్టడము అనేది కాదు. అర్చకులకు ఇవ్వాలి. ఇవ్వకూడదనా మీ వుద్దేశ్యం? అది చాలా తప్పు.

SRI B. SANKARAYYA :—వాళ్ళకు ఇవ్వకూడదని మా వుద్దేశ్యం కాదు. అర్చకత్వం చేసినందుకు అతనికి నెలకో, సంవత్సరానికో ఇంత ఇవ్వాలి అనుకోవాలిగాని, మొత్తం అంతా ఆస్థులను అర్చకులకు కట్టిబెట్టడము అనే పద్ధతిని వాళ్లు చేసినా చెయ్యకపోయినా ఇవ్వడానికి అగ్రిమెంట్లువున్నాయి. అది కావాలంటే నేను రుజువు చూపించగలను. ఈ విషయం మంత్రిగారి సమక్షంలో జరిగింది. దానిని ఇక్కడ చెబుతున్నారు.

అర్చకులకువారు చేసినటువంటి విధినిర్వహణకు నెలకు యింతనో, సంవత్సరమునకు యింతనో ఇచ్చే దానికి ఏపార్టీకికూడా ఆక్షేపణలేదు. కాని మొత్తం అక్ష ఆదాయం వచ్చే సంస్థలలో నుంచికూడా కొంతభాగము అనేదితీసి పూర్తిగా సర్వాధికారంగా వాళ్ళకు అమ్ముకొనే దానికికూడా సర్వహక్కులు ఇచ్చేటటువంటి దానినిమాత్రం చాలామంది ఇక్కడవుండే అన్ని పక్షాల్లోకూడా వ్యతిరేకించేవాళ్లు వుండవచ్చును. అందువల్ల ఈ విషయం ఇక్కడ అసెంబ్లీకి తెలియచేయాలి. అట్లా చేయలేదు. కనీసం ఇక్కడవుండు రెంటుబిల్లు తీసుకువచ్చినప్పుడు అయినా ఆ బిల్లులోఅయినా కూడా ఇది మంచిది చేయబోతున్నాము అనేదికూడా తీసుకురాకుండా ఈ విధంగా

చేయడమనేది వీటి నన్నింటినికూడా చూస్తే ఇది సక్రమమైనటువంటి ఉద్దేశ్యములతో ఈ నిర్వహణ సరిగాచేస్తున్నారని అనుకునేదానికి వీలు లేదు.

ఇంకొక clause లో ఏమిచెప్పారు ? బకాయిలుఉంటే ఆరుసంవత్సరాలకు కూడా వసూలు చేసుకోవాలని చెప్పారు. Contribution రు. 200 లు, రు. 250లు వచ్చే దేవళాలు ఉంటాయి. సంవత్సరానికి దేవళంలో విధిని నిర్వహించాలంటేనే చాలదు. ప్రభుత్వంకిస్తే levy కాకుండా 6 సంవత్సరాలు కట్టాలంటే సాధ్యం అవుతుందా ? చిన్న దేవళాలైనా మినహాయించారా ?

MR. SPEAKER :—కొన్నింటికే 5% ఉన్నది.

THE HON SRI K. CHANDRAMOULI :—5% కు తగ్గవచ్చు. తగ్గినవికూడా ఉన్నాయి.

SRI B. SANKARAIAH :—రు. 200 లు, రు. 300 లు వచ్చే దేవళం ఉంటే 5% పుచ్చుకునే అవకాశం ఉన్నదికదా, ఆరుసంవత్సరాలు బకాయిలు వసూలు చేయడానికి provision కలుగచేస్తున్నది కదా, ఆరుసంవత్సరాలు బకాయిలు దేవళందగ్గర అప్పుతెచ్చి కట్టాలంటే తీరేది ఎప్పుడు ? విధులు ఏ విధంగా నిర్వహిస్తారు ? ప్రభుత్వంలో ఈ మొత్తంతో జరిగేవిషయాలు యేమిటో పక్షపాతంలేకుండా ఆలోచించండి. రు. 5000 లు పైన విలువఉంటే భూములను యివ్వాలి అన్నారు. మిగతావి వేలంవేస్తే ఎక్కువ ఆదాయం వస్తుంది అన్నారు. ఈ విధంగాకూడా వేలంవేయని భూములు ఎన్నిఉన్నాయి ? Trustees మీద చర్య తీసికున్నారా అని అడుగుతున్నాను. వేలంవేయని భూములు ఎన్నోఉన్నాయి. మంత్రిగారికి ప్రత్యేకంగా తెలుసును. వేలంవేయలేము ; Goverament order carry out చేయలేము. సుష్టుగా పరిపాలన సాగడానికి ఇవన్నీ చేస్తున్నాము అన్నారు. ప్రజలఅభిప్రాయం ప్రకారమే పరిపాలన చేస్తున్నారా ? మీ యిష్టం వచ్చినట్లు trustees వేస్తాము అంటున్నారు. ప్రభుత్వ orders ప్రకారం వేలం వేయకుండా, ఇష్టంవచ్చినవాళ్లకు ఇచ్చుకుని దుర్వినియోగం చేసుకొంటూంటే ఎన్నో కేసులు తీసుకువస్తే ప్రభుత్వం ఏమిచేస్తోంది ? పరిపాలనావ్యవస్థ సరిగ్గా జరిపేదానికి ఖర్చుచేయకుండా, ఆరుసంవత్సరాలైనా జవాబు యివ్వకుండాఉంటే Gazetted Officers, Inspoctors ను వేసి డబ్బుఅంతా తీసుకుపోయి ఏమిచేయాలని ? ఇవి ధర్మసంస్థలు కాబట్టి సక్రమంగా నిర్వహించాలి. ఏమైనాఅంటే మీకు దేవుడు మీద నమ్మకంలేదంటారు. దేవుడుమీద నమ్మకం వున్నదంటూ డబ్బుఅపహరిస్తుంటే వాళ్లు manage చేయడం ? భక్తి అనేక విధాలుగా వుంటుంది. ఆ విధంగా ఎందు

కనాలి ? మాటకుముందు దేవునిమీద నమ్మకంలేదనే విషయం ఎందుకు తీసుకు రావాలి ? తిరుపతి దేవస్థానానికికూడా అన్నిపక్షాలనుంచి ట్రస్టీబోర్డు వేశారు. ఈ విషయం వచ్చినప్పుడల్లా నమ్మకం ఉండాలంటున్నారు. నమ్మకం దేనిమీద ? తనఉద్దేశాల ప్రకారంగా ధర్మఆదాయం ప్రజలకు వినియోగపడేటట్లు చేయాలి. దానికి అనుగుణమైన విధంగా ప్రభుత్వం పనిచేస్తుందా ? కనీసం ప్రజలు ముగ్గురు ట్రస్టీలు వుండాలంటే పెడుతున్నారా ? ఇదివరకు area కమిటీలు వుండేవి. అవి కూడా తీసివేశారు, ఇప్పుడు లేవు.

The Hon. Sri K. CHANDRAMOULI :—ఇదివరకు తీసేశారు. ఇప్పుడు మళ్లీ పెట్టారు. కొన్ని ఆటంకాలువచ్చి suspension లో పెట్టారు.

Sri B. SANKARAYYA :—పరిపాలన సరిగ్గా డెమోక్రాటిక్‌గా జరగాలి. అన్ని ఆస్తులను సరిగ్గ అజమాయిషీ చేయాలి. మోపూరులో లక్షరూపాయల విలువచేసే ఆస్తులు కొద్దిమంది కంట్రాక్టుపద్ధతిమీద అనుభవిస్తున్నారు. దీనిని ప్రభుత్వం దృష్టికి ఎంతోమంది తీసుకువచ్చారు. ఎవరిమీదనైనా చర్య తీసుకున్నారా? పరిపాలన సక్రమంగా జరగడానికి provisions తీసుకువస్తే అన్ని పక్షాలవారూ బలపరుస్తారు. సక్రమంగా ప్రజల కనుగుణంగా పరిపాలన జరిగేటట్లు చూడాలి. యిష్టంవచ్చినవాళ్ళను 5 గురిని ఊడ బెరికి ఒకరినే ట్రస్టీగా వేయడంకాదు. పంచాయతీబోర్డుల కియ్యడానికి యేమి అడ్డంవస్తుంది ? తక్కిన పరిపాలన చేస్తున్నప్పుడు యీ పరిపాలన నిర్వహించలేరా ? శాసనసభకు తెలియకుండా మంత్రిగారు యెక్కడికో పోయి అర్చకవిధి నిర్వహణకోసం ఏదో చేయవలసిన అవసరం ఏమిటి ? ఈ బిల్లును ప్రస్తుతం వాయిదావేసి సమగ్రమైన బిల్లును తీసుకురావాలని కోరుతున్నాను.

Sri N. VENKAYYA :—అధ్యక్షా, నేటికయినా మత సంస్థల ఆదాయాన్ని మన మతప్రచారంకొరకు దేవాలయ పునరుద్ధరణకొరకు, వినియోగించడానికి ఖర్చులుపోను అయినా ఒకఫండు ఏర్పాటుచేయడానికి ఒక సవరణ తీసుకువచ్చినందుకు మంత్రిగారిని అభినందిస్తున్నాను. వారు ప్రత్యేకంగా యీ ఫండు ఏర్పాటుచేయడానికి రు. 1000 లు రు. 2000 లు ఆదాయం మించిన ధర్మాలనుంచియే 5 వ వంతు అనో, 10 వ వంతు అనో ఫండు సేకరించడానికి ఒక సవరణతెస్తే యింకా ఎక్కువ అభినందనలను కనపరచడానికి కుతూహలం కలిగేది. మనం దేవాదాయ, ధర్మాదాయాలనుండి వచ్చిన ఆదాయాన్ని సక్రమంగా రాబట్టడానికి, వినియోగించడానికి కొన్ని గట్టి చర్యలు తీసుకొనే అవకాశం యేర్పడింది. ఈ చట్టం మొట్టమొదట యేర్పాటు చేసినప్పుడు పరప్రభుత్వము ప్రజలలో అధిక సంఖ్యాకుల మతానికి సంబం

ధించని ప్రభుత్వమయి నందువలన చాలా జాగ్రత్తగా మతవిషయాలలో జోక్యం కలిగించుకుంటే ప్రమాదం అన్న భావంతో ఈ చట్టాన్ని తీసుకువచ్చారు. ఇప్పుడు అటువంటి పరిస్థితులు లేవు. కోర్టులకు వెళ్ళకుండా మతాదాయాలు రాబట్టడానికి సక్రమంగా వినియోగించడానికి తగిన పటుతరమైన సెక్షన్లతో సవరణ చట్టం తీసుకు రావడం చాల అవసరం. కోర్టులకు వెళ్ళవలసిన అవసరం లేకుండగా దేవాలయ శాఖాధికారులకు ఎక్కువ అధికారాలు యివ్వడం చాలా అవసరం. ఈ ఫండ్ నుంచి పెట్టేఖర్చు ఎక్కువగా ప్రాచీనమత ఔన్నత్యాన్ని తెలియజేయుటకు దేవాలయ శిల్పాన్ని గుర్తింపచేసి పునరుద్ధరణ చేయుటకు మతసంస్కృతిని సంగీతాన్ని, కవిత్వాన్ని, యితరకళలను, మతపుస్తకాలను, మతపుస్తకాలు ప్రచురణను అభివృద్ధిచేయడానికి వినియోగిస్తారని ఆశిస్తున్నాను. కేవలం మత ధర్మాదాయాలను కాలేజీలకు, యూనివర్సిటీలకు వినియోగించడం చాలా శోచనీయమయిన విషయం. ఇతరత్రా ప్రజల ఆదాయాలనుంచి, ప్రజల ధర్మాలనుంచి యీ కార్యక్రమాలకు వినియోగిస్తే బాగుంటుంది. మతానికి సంబంధించిన సంస్థనుంచి వచ్చే ఆదాయాన్ని మతప్రచారం కోసమే వినియోగించడం మంచిది. మన మతం అంటే యేమిటో మనలో చాలా మందికి తెలియదు. ప్రజలలో అధిక సంఖ్యాకులకు తెలియదు. దీనివలన యితర మతస్థులు యిక్కడవున్న ప్రజల అజ్ఞానాన్ని ఆధారంగా చేసుకుని తమ మతప్రచారం ద్వారా వైద్యంద్వారా ఆకర్షించి పరమతస్థులుగా మార్చడానికి ఎటువంటి ప్రయత్నాలు జరుపుతున్నారో అందరు గమనించి వుంటారు. అందువల్ల మతవిజ్ఞానాన్ని పెంపొందచేయడానికి తగినపండు ఏర్పాటుచేసి మన విజ్ఞానాన్ని ప్రచారం చేయడానికి తగిన అవకాశాలు కల్పించవలసినదిగా మంత్రిగారికి సూచిస్తూ యీ సవరణను సంతోషపూర్వకంగా బలపరుస్తున్నాను.

SRI RAJA V. V. KRISHNAMRAJU BAHADUR :—అధ్యక్షా! ఇప్పుడు మన రెవిన్యూ మంత్రిగారిద్వారా తీసుకొని రాబడిన Common Good Fund అనేది దేవాదాయ ధర్మాదాయ విషయంలో కొంతడబ్బు స్వీకరించి ఆ డబ్బు ద్వారా సంస్కృత పాఠశాలలు వేదపాఠశాలలు ఇతరత్రా సంస్కృత సంప్రదాయాలు ఆధ్యాత్మిక చింతన సంస్కృతము వగైరాలు వృద్ధిచేయడను జరుగుతుంది. కాబట్టి ఈ Common Good Fund ఏర్పాటుచేసినందుకు తమ ద్వారా అభినందిస్తున్నాను. వేమయ్యాగారు ఏమి చెప్పారు అంటే ప్రాచీనముగా మన హిందూ ధర్మశాస్త్రము ప్రకారముచూస్తే మన దేశములో పెద్దవారు అధ్యాత్మిక చింతనతో దేవాదాయాలను సృష్టించి కట్టించి సమస్తమానవ కోటికీకూడా ఒక దృశ్యముగా

Sri Raja V. V. Krishnamraju Bahadur] [30th September 1955

తద్వారా పేదాముక్తి సాధించడానికి దేవాలయాలు కట్టించారు. నేటివరకు పారంపర్య Trutsee లుగా ఉన్నటువంటివారిని తప్పించాలని వేమయ్యగారు మాట్లాడడము చాలా విచారించవలసిన విషయము. ఈ నాడు ఈ సభలో వేమయ్యగారు నేను కూర్చున్నామంటే అది మాకు ప్రయోజన voting దృష్ట్యా ఈ అవకాశము కలిగింది. అట్టి పరిస్థితులలో దేవాలయములు కట్టించి దేవుని ప్రతిష్టించి సర్వ మానవకోటికి ముక్తిసాధనముచేసినట్టి కుటుంబరీత్యా trustee లుగా ఉన్నవారిని తప్పించుమని కోరడము చాలా విచారకరమైన విషయము. మన దేశము అధికార బంధురములో నుండి పరదేశరాజులు పరిపాలించే పరిస్థితులలో దేవాలయాలు సత్రములు సంస్కృత పాఠశాలలును ఆనాటి ప్రభువులు భూస్వాములు పెద్ద ధనికులు ఆధ్యాత్మిక చింతనతో ప్రాచీనసంస్కృత సంప్రదాయాలను వృద్ధిచేసే అవకాశము కల్పించారు. ఈ నాడు ఈ Common Good Fund గురించి ఈ విధముగ మాట్లాడడము న్యాయము కాదని మనవిచేస్తున్నాను.

జమీందారులు రద్దయినతరువాత దేవాదాయాలు ప్రభుత్వము స్వాధీనములోనికి వచ్చినతరువాత దేవునిపూజకూడా జరుగడము లేదు. అట్టి పరిస్థితులలో ఈ Common Good Fund నిత్యకృత్యాలకు వేదపాఠశాలలకు ఉపయోగపడవచ్చును. కాబట్టి దీనిని ఆమోదిస్తూ ప్రతిపక్షమువారుకూడ ఆమోదించవలెనని కోరుతున్నాను.

SRI B. APPA RAO :—అధ్యక్షా ! మంత్రిగారు తెచ్చిన సవరణ అసలు చట్టానికి అభివృద్ధికరమైనది. ఆ దృక్పథంతో ఆలోచిస్తే అంగీకరించతగ్గది. అభివృద్ధి నిరోధకముగాఉన్న చట్టాలలో అభివృద్ధిని శాసించే సవరణను అభివృద్ధికాములు అంగీకరించవలెను. లేని అభివృద్ధిని సాధించుకోవడానికి కృషిచేయవలెను. చేస్తున్న దానిని సంతోషంతో అంగీకరించవలెను· అడ్డుకాలువేసి అసలుకు నష్టమువచ్చేటట్టు చేయకూడదని నా అభిప్రాయము. అసలు విషయము హైకోర్టులో Writ ను అనుసరించి మొత్తము ఆదాయములో ఖర్చులుపోను మిగతాఉన్నది అభ్యుదయ కార్యక్రమాలకు ఖర్చుపెడతామన్నదే ఈ సవరణ. దానికి ఈ తర్జన భర్జన లెందుకు ? దేవాలయములలో చాలా అవకతవకలు ఉన్నవని చాలా మందికి తెలుసును. అయితే వానినిగురించి అవకాశము చిక్కినప్పుడు సమగ్రముగా ప్రభుత్వము ఆలోచించి ఒకచట్టము తీసుకురావలెనని కోరడంలో సబబువుంది. కాని ఇప్పుడు ఇస్తూన్న percentage కొన్ని మందిరాలకు తక్కువగాఉంది. అవకాశముఉంటే ప్రభ్వుతము అదనంగా ఎక్కువఖర్చుపెట్టవలెనని చెప్పడము సబబుగా ఉంటుంది. మా తాలూకాలో కొన్ని మందిరాల Trustee లతో నాకు సంబంధముంది. నేను trustee నుగాను. Trustee విధానముతో ఏకీభవించనివారము మేము. కొందరు

Trustee లు మూర్ఖులుగాను భగవంతుని డబ్బుఉంటే ఈ మందిరాలు మఠసంస్థలు వర్ధిల్లవు. ఇప్పుడిప్పుడేవచ్చారు ఉద్యోగస్థులు. వెనుకటికి ఒక తాసీల్దారు ఉన్నాడు. ఆయన Ranger గాగాని దేవాలయాల Inspector గాగాని ఉద్యోగమిస్తే ఈ తాసీల్దారు ఉద్యోగానికి నీళ్లు వదులుకోవడానికి సిద్ధంగా ఉన్నాను అన్నాడు. ఈ Inspector లు Trustee లలో తగాదాలుపెట్టి వారి సత్వంలో తగువులు తీసుకువచ్చి పెద్దతండ్రికొడుకులకు చిన్నతండ్రికొడుకులకు డబ్బు సంపాదించే Inspector లు కూడా ఉన్నారు. తమ సొంతఆస్తిని త్యాగముచేసి దేవాలయాలను పోషించేవారు అనేకమంది ఉన్నారు. మరొకవిధంగా వారు డబ్బు ఖర్చుపెట్టరు. కాబట్టి అభివృద్ధికాములు ఈ సవరణను అంగీకరించి అడ్డుకాలు వేయకూడదని చెప్పుతూ ఈ సవరణను మనస్ఫూర్తిగా బలపరుస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:–అధ్యక్షా! క్రిందటి తడవ శాసనసభలోచేసిన తీర్మానముయొక్క పరిణామము ఇది. ప్రతితడవ amendment తీసుకువస్తూన్నాము. అతుకుతూఉంటాము. జారిపోతే మళ్లి ప్రారంభించడం జరుగుతూఉంది. నిన్న జరిగింది రేపు జరుగవచ్చును. ఇదివరకున్న కమిటీ సమగ్రమైన బిల్లును తీసుకురావలెనన్నది. ఎన్నిరోజులలో మీరు తేగలరో చెప్పమని నేను కోరుతున్నాను. 6 సం॥ల పాతబాకి వసూలుచేస్తామంటున్నారు. Special law వస్తే old law పోతుంది. కాబట్టి special law provision maintain అవుతుంది. Limitation అభ్యంతరము లేదంటారేమో ? ఇంకొకసారి High-court కు వెళ్ళడము అవుసరముంటుందేమో నాకు అనుమానంగాఉంది. High Court కు వెళ్ళడము Supreme Court కు వెళ్లడము జరుగవచ్చును. అనుమానము రావడము amendment తీసుకొని రావడము, High Court కు వెళ్లడము మళ్లా amendment ఈ విధంగా సర్కిలు తిరుగుతూ ఉన్నట్లు కనబడుతుంది. Mudaliar గారు చెప్పినట్లు ఈ Religious Endowment Act చూస్తే High Court, Supreme Court amendment తప్ప ఇంకేమీ కనబడదు. అందుచేత ఇబ్బందిలేకుండా చేయాలి.

Administrative side న Executive Officer లను వేస్తూ ఉన్నారు. ఆంధ్రరాష్ట్రము వచ్చే సమయంలో August, September నెలలలో examination పెట్టారు. Qualification లు ఉండవలెనన్నారు. మిమ్ములను మేము తీసుకున్నాము అన్నారు. వారంతా ఇతర ఉద్యోగాలకు పోకుండా order ల కోసము ఎదురుచూస్తూన్నారు. ఇంతవరకు ఏమైందో తెలియదు. Treasury కి డబ్బు

Sri Vavilala Gopalakrishnayya] [30th September 1955

చెల్లించారు. పరీక్షలకు వెళ్లారు. డబ్బుకట్టినట్లు Endorsement వుంది. కాని ఎక్కడో గల్లంతు జరిగింది. జాబితా ఎక్కడుందో తెలియదు. జాబితా ప్రకారము పాతవారిని తీసుకొని తరువాత క్రొత్త వారిని వేస్తే అది న్యాయముగా వుంటుంది. లేకపోతే పరీక్షలు పెట్టండి. పాతలిస్టులో వారికి ఉద్యోగాలు ఇవ్వందే కొత్తవారిని తీసుకోడం న్యాయంకాదని మనవిచేస్తున్నాను.

4-30 p. m.

పెద్ద పెద్ద దేవాలయాలలో డబ్బు బైటకు రావడంలేదు. ఇప్పుడు గుంటూరు జిల్లాలో జరిగిన ఒక విషయం చెబుతాను కాని పేర్లు మాత్రం చెప్పను. ఒక Commissioner గారి దగ్గర కూర్చుని కూర్చుని ఆయన వెంబడి 3 నెలలు తిరిగితే, చివరకు ఆయిన ఉపవాసం చేసే పద్ధతికి కూడా వచ్చి విసుగెత్తి 'సరే వస్తాను లేవయ్యా' అని వెళ్ళాడు. 25 వేల రూపాయిల misappropriation బైటపడ్డది. ఇంత కథ ఉన్నదని నాకు తెలియదండి అన్నాడాయన. ఇప్పుడు enquiry లో ఉన్నది కనుక ఆ ఊరిపేరు చెప్పడంలేదు. ఇవన్నీకూడా ఉండేటటువంటి మంచి administration నడిపే పద్ధతీ ఏదైనా ఆలోచించండి. ఇదివఱకు కమిటీ వేసినటువంటిదాన్ని, ఇటువంటి అవస్థలు లేకుండా ఉండేటటువంటి Act ఏదైనా ఆలోచించి ఒక సమగ్రమైన report తీసుకురావలసిందని కోరుతున్నాను. ఈడబ్బుకూడా సద్వినియోగం అయ్యేందుకు పూర్తి ప్రయత్నం చేయమని కోరుతున్నాను.

THE HON SRI K. CHANDRAMOULI :—అధ్యక్షా, గౌరవనీయులైన సభ్యులు చాలామంది ఇప్పుడు మనముందున్న బిల్లును సంబంధంలేని చాలా విషయాలను గురించి మాట్లాడారు. అవన్నీ ఇప్పుడు తీసుకునే దానికన్న, ఒక విషయం మాత్రం మనవిచేస్తాను. దేవాలయాల పరిపాలన సక్రమంగా జరగాలి. Act సరిగా ఉండాలి. ఇదంతా కూడా మనం అభివృద్ధికరమైన విధానాలతో చెయ్యాలనేటటువంటి విషయంలో మనకెవరికీ ఏమీ అభిప్రాయభేదాలు లేవు. కొత్త Act తేవాలి. ఏరకంగా తేవాలి, మొదలైనవన్నీ ఆలోచించ వద్దని నేననటంలేదు. కాని ఇప్పుడు మనం చర్చిస్తున్నవిషయం మూడు సంవత్సరాలుగా బకాయిపడియున్న levy వసూళ్ల విషయం. అది వసూలు చేసుకోడానికి వీలులేకపోయింది. వాటిని వసూలు చేసుకొనే నిమిత్తం ఇప్పుడు ఈ సవరణను మనం తీసుకువచ్చి, ఏదైనా సరిచేసుకుని ఉన్నబాకీలు వసూలు చేసుకుంటే ఆ డబ్బుతో administration నడపవచ్చు. జీతాలివ్వాలంటే డబ్బుకావాలి. శంకరయ్యగారు ఒక వంక staff కావాలని చెబుతారు. రెండవప్రక్క డబ్బు అక్కరలేదంటారు. ఊరికే చేసేవాళ్లు ఎవరైనా ఉంటే నాకు సంతోషమే. Voluntary work

